# జయంతి
# 4

సం. ౧ సం. ౪ ఫిబ్రవరి, ౧౯౬౯

---

ఈ సంచికలో




# జయంతి

## 4

జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః.




సంపాదకమండలి :
విశ్వనాథ సత్యనారాయణ
(అధ్యక్షులు)
మల్లంపల్లి సోమశేఖరశర్మ
దివాకర్ల వేంకటావధాని
కేతవరపు రామకోటిశాస్త్రి
జువ్వాడి గౌతమరావు

సంవత్సర చందా రూ-౦
విడిప్రతి ౭౫ న. పై.

# సంపాదకీయము

మనదేశములోనికవతరించిన నూతన సాహిత్యములో పురాతన సాహిత్యములోవలెనే కొంత భాగము కృతకముగా నున్నదని తొలి సంచికలోని సంపాదకీయములో ఉద్ఘాటించియున్నాము. ఇచట దాని ప్రసక్తి కొంత చేయవలసి వచ్చినది. అప్పుడప్పుడు తెలుగుదేశాన కొన్నిసభలలో నూతన సారస్వతముపేర కొన్ని విపరీతోక్తులు ప్రచారితము లగుచున్నవి. క్రొత్త కవిత్వమన్న పేరు చాలును; దానికి పత్రికలు ప్రచారమిచ్చుచున్నవి. పురాతన కవితామార్గగాములు నూతన కవితా మార్గగాములను తిరస్కరించుటయు, వీరు మరల వారిని తిరస్కరించుటయు వివేకపథము కాక పోయినను మానవ సహజలక్షణముగా పరిగణించి సహింపబడవచ్చును. కాని ఆ రెండు మార్గముల యందును సమర్థులు కానివారు ఏ మార్గమునందును యథార్థమైన విశ్వాసములేనివారు, కీర్తి ప్రతిష్ఠల కొఱకు నేదో యొకమార్గ మవలంబించి రెండవ మార్గము నాడిపోసికొనుట వివేకులకు నర్థమగునట్టి విషయము కాదు.

జయంతి తొలిసంచికలోని సంపాదకీయము జాగ్రత్తగా చదివినవారికి జయంతి యొక మార్గ మును వెనుక వేసికొని వచ్చుచున్నదని యనుటకు వీలులేదు. ఇంతవరకు వెలువడిన జయంతి సంచిక లలో నూతన మార్గము మార్గము కాదని తత్సంపాదకుల యభిప్రాయమని చెప్పుటకు వీలులేదు. జయంతికి ప్రతిభ యెచ్చట నున్నను స్వీకార్యమే. ప్రతిభాహీనమైన శుష్కరచన సర్వథా తిరస్కార్యమే.

ఆ నడుమ మదరాసులో నొక సభా సందర్భమున కొందరు కవులు జయంతిని లక్ష్యముగా చేసి జయంతి నూతన మార్గమునకు వాడుక భాషకు విరోధియని ప్రసంగించినట్లు పత్రికా వార్తల వలన తెలియవచ్చినది. ఈ సందర్భములో ముఖ్యముగా మూడు విషయములు చెప్పవచ్చును. వారు చేసిన నిందలివి :

1. వాడుక భాష విజృంభించుచున్నది. దానికి జయంతి వ్యతిరేకి.
2. అర్థమయ్యెడు భాషలోననే వ్రాయవలయును.
3. క్రొత్త కవిత్వమే ఇంచుమించుగా కవిత్వమని చెప్పదగినది.

ఈ మూడు విషయములలోని తాత్పర్యమే ఆనాటి వక్తల యభిలషితముగా కనిపించుచున్నది. నేడు కవులుగా ప్రసిద్ధివడసిన చాలమంది పూర్వమార్గము ననుసరించి గ్రంథములు వ్రాసి కవుల మనిపించుకొన్నవారే. అందరికి నర్థము కావలయునని నినాదము సేయువారందరు ఈ జాతివారే. వారు కవులమన్న ప్రతిష్ఠ సంపాదించుకొనుటకు పూర్వమార్గము ననుసరించి కావ్యములు వ్రాసి కవులై ఆ కొంచెము ప్రతిష్ఠ నిలుపుకొనుటకు ప్రజానినాదములు స్వీకరించి యొక నాటక మాడు చున్నారు. వాడుకభాష కొఱకు ప్రచారము చేయువారనేకులు తమ గ్రంథములు వాడుక భాషలో వ్రాయలేదు. గ్రాంధికభాషలోనే వ్రాసిరి. గ్రాంథిక భాషలో ప్రసిద్ధులైనవారి యభిప్రాయములనే తమ కావ్యమునకు జోడించుకొనిరి. వారి అధ్యక్షతల క్రిందనే సభలు జరిపించుకొని పేరు గడించు కొనుటకు ప్రయత్నము చేసిరి. వారి కావ్యము లందర కర్థమగునా? అర్థమయ్యెడి కావ్యముల కభిప్రాయము లెందుకు? నేనిందులో ఈ క్రొత్త యర్థము బెట్టితిని. ఇందులోని విశేషార్థ మున్నది. ఇది తెలిసికొనుట కష్టము అని చెప్పుటయు, అట్టి యర్థములను జోడించుటచేత తాను గొప్ప కవినను కొనుటయు, అందర కర్థము కావలయునని ప్రజా నినాదములు పలుకుటయు, నివి యొకదాని కొకటి పొసగని విషయములుకదా! ఇట్లు ప్రచారము చేయుచున్న వారిలో నిజముగా కవిత్వము క్రొత్తమార్గమున వ్రాసినవాడు శ్రీశ్రీ యొక్కడే. తక్కినవారందరు చంపకములు, ఉత్పల

మాలలు, సీస పద్యములు, వచ్చెను, పోయెను, చూచుచున్నాడు, రామునకు మొదలైన వ్యాకరణ రూపములు చేతనైనన్ని సమాసములు మొదలైన హంగామాతో కవిత్వము వ్రాసినవారే. వారి కావ్యములలో సమృద్ధిగా సమాసములున్నవి. వారికి తెలిసినంత వరకు గ్రాంథిక రూపములనే వాడుటకు వారు ప్రయత్నము చేసిరి. ఇట్టివారు మన దేశమునందు పెక్కురు కలరు. వీరు వాడుక భాషా వాదుల మందురు. కవిత యందర కర్థము కావలయునందురు. ప్రపంచకమంతయు మారి పోవలె నందురు. వీరి యీ మాటలు ఎంతవరకు విశ్వాస్యములో తెలియదు. ప్రజలలో కొంత పలుకుబడియు పేరును చలామణితనమును సంపాదించు కొనుటకు ఇట్లనుచున్నారేమో యని వారి కావ్యములు చదివినవా రనుకొన వలసి వచ్చుచున్నది. ఇదియేమి? వీరి కావ్యములు సంప్రదాయ మార్గమున నున్నవి. వీరికి కవులన్న ప్రతిష్ఠకూడ నా హేతువువలననే వచ్చినదేమో! వీరిట్లు మాటాడుదురేమి? అని వారి కావ్యములు చదివినవారికి సందేహము కలుగక మానదు.

పద్యము వ్రాసినంతనే వాడుక భాషలో వ్రాయుట సంభవించుటలేదు. అంతటి నార్లవారి వాస్తవపు పద్యములుకూడ గ్రాంథిక భాషలోనే యున్నవని చెప్పవలయును. పాట వ్రాసినచో వాడుక భాషా రూపము లెక్కువ రావచ్చును కనుక నిట్టి వివక్ష చేసినచో బాగుగా నుండునేమో! పూర్వ చ్ఛందస్సులకు నియమిత భాషయును, పాటలకు వాడుక భాషయును, ఇట్టి వ్యవస్థ యేర్పడినచో అందరు నంగీకరించినచో ఈ రెండు మార్గములకు విరోధములేదు. విషయములను పరిస్థితులను కలగలిపి అవ్యవస్థితముగా మాటాడనక్కఱలేదు. వివిచ్యమానముగా నిదియిది ఇది యిది అని తొలుత నిరూపించుకొన వలయును. 'వస్తాడు, పోతాడు, ఏం, వచ్చావా, మరిగినే, అదేందిరా,' ఈ మొదలైనటువంటి రూపములు ఈ క్రొత్తభాషావేత్తలుకూడ పద్యములలోని కెక్కించినట్లు కనుపించలేదు.

ఇంతకు గ్రాంథిక వ్యావహారిక భాషారచనా మార్గములు సువ్యవస్థితము లింతవరకు కాలేదు. దీనికి కారణమేమియని ఊహించినచో వ్యావహారికభాషలో ప్రతిభావంతులైనవారు వ్రాసిన గ్రంథములు తగినన్ని లేకపోవుటయేమో యనిపించును.

మరియొక ప్రశ్న యున్నది. ఈ కొందరు 'అందరకు నర్థమగు భాషలో వ్రాయవలయును.' అన్న నినాదము పౌనఃపున్యముగా చేయుచున్నారుకదా? దాని తాత్పర్యమేమి? అని కొంత విచారించినచో నిట్లు పొడకట్టగలదు. పూర్వ గ్రంథములయందు కొన్ని కవిసమయములు కలవు. ఎంతకాదన్నను వర్ణాశ్రమాచార వ్యవస్థాశ్రయముగా తత్కావ్యములోని కల్పనాదులు కథలు నుండును. ఆధునికులు భిన్నమైన మనోమార్గము కలవారు. బాహాటముగా ఆ పూర్వసంప్రదాయములు కావని చెప్పుటకు బదులు అందర కర్థము కావలయునన్న యొక వ్యాజపుమాట మాటాడుచున్నారేమో! అనగా సంప్రదాయమైన దర్థము కాదని తదితరమైనది యర్థమగునని ప్రజలయందొక యభిప్రాయము కలిపించుటకు నిట్టి నినాదములు చేయుచున్నారేమో యనిపించును.

ఇదికాదు. కొద్దికొద్ది సమాసములైనను సామాన్యజనుల కర్థమగును. పద్యములో వ్యాకృత రూపములు లేనిచో పద్యమునకు పద్యత్వములేదు. మేమూ ఛందస్సులను స్వీకరించినను మేమును సమాసములు వాడినను మా కవిత్వమందర కర్థమగును అందురేమో? అన్నచో వారి గ్రంథములలో నుండి సామాన్యుల కరముకాని వందలాది సలములు చూపించవచ్చును.

'ప్రావృడంభోధరస్వామి' - ఇది యందర కర్థమగునా? అందర కర్థమగునట్లు కవిత్వము వ్రాయవలయునని సభావేదికలనుండి యుపన్యాసములుచేయు అందరికవుల గ్రంథములలోను సామాన్యజనుల కర్థముకాని పద్యములు చూపించవచ్చును. వారొకవాదన చేయవచ్చును. అట్టిభాగములు లేవని మేమనముకాని మొత్తముమీద మా కవిత్వ మెక్కువ భాగము సర్వజనుల కర్థమగును. అని వారు వాదించవచ్చును. అట్లయినచో పలుగురాళ్ళనిపించుకొన్న పూర్వకావ్యము లలోనుండి కూడ యందరకు నర్థమగు భాగములు తీసి చూపించవచ్చును. ఎక్కువ పూర్వకావ్యము లలో నందర కర్థములగు భాగమే యెక్కువ. లేనిచో నా కావ్యము లిన్నాళ్ళు నిలువవు. ఐనచో లక్షణము సమానముగా నున్నపుడు భేద మెక్కడ నున్నది? భేద మిక్కడ నుండి యుండవలయును. ఎక్కడననగా ఆపూర్వకవులు తమ మార్గాములు కవిత్వమందరకు నర్థము కావలయును, అట్లు వ్రాయవలయును అని వారనలేదు. వీరనుచున్నారు. ఇంతియే భేదముగా కనిపించుచున్నది. ఏల ననగా, ఈ క్రొత్తకవులకు వేరే కవిసమయములు కలవు, ముండ్లకిరీటము, ఇనుపబూట్లు, ఇనుపతెర, మొదలైన యెన్ని కవితాసమయములుకలవు వీరికి? ఇవి యందరి కర్థమగునా? క్రైస్తవమతము కొన్ని రాజకీయసిద్ధాంతములు; వానిలో నానిన మనస్సులకు మాత్రమే ఈ కవి సమయములు తెలియును. ఇంగ్లీషు భాషలోనున్న కొన్ని సంప్రదాయములు తెలియనిచో ఈ యాధునికుల కవి సమయములు తెలియవు, వీరి యూహలు తెలియవు, వీరి కల్పనలు తెలియవు. అందరి కర్థము కావలయునన్న శీర్షిక క్రిందికి వీరి కవిత్వమును రాదు. ఎవరిచ్చిరిరా నీకీ పెత్తన మనగా ఆమూల నుండగా నెత్తిన వేసికొంటినన్నట్లు అందరకు నర్థముకావలయునన్న నినాదముచేత వీరు సాధించ దగిన దేమియులేదు. తాము వ్రాసిన యొకటి రెండు గ్రంథముల వలన తమకు వచ్చిన కవులన్న ప్రతిష్ఠను పలుసభలకు పిలువబడి అములులోనున్న కవులుగా పరిగణింపబడునట్లు చేయుటకొరకు ఈ నినాదములు పనికివచ్చును. విచారణా దక్షులకీ రహస్యము చాలయేండ్లుగా తెలియును. పత్రికలు వీరికి ప్రచారమిచ్చినను పత్రికలలో వీరి కనుకూలముగా వ్రాసి తమ యిండ్లలో తామును తమ స్నేహితులును మాట్లాడుకొనునప్పుడు యథార్థము వారును మాటాడుకొంచునే యుందురు. ఇది చూడుడు. వారి విశ్వాసమొకటి, వారు ప్రచారముచేయునది యొకటి. తాను విశ్వసించినది ప్రచారముచేయుట సత్పురుషలక్షణము. సారస్వతాభివృద్ధి హేతుకము. నిజమైన సంస్కృతికి దారి తీయునది. భావుకతను పెంపొందించును. ప్రతిభావంతులైన కవులు బయటికి వత్తురు. ఇది దేశాభ్యుదయ హేతువు.

# ప్రణవస్వరము

తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

ఒక మహామృతవిస్ఫురదుత్సవంబు
కలుగుచున్నది గాలి యుగ్రస్వనాన—
తన్మహామాధురీజనితం బదేదొ
గాలితోవచ్చి చెవులలో కలవరించు.

వక్త యెవ్వడు ? శ్రోత యెవ్వం డయారె ?
ప్రాణి యేదేని యీ ప్రదేశాన కలదొ ?
ఏ మహర్షి సందేశభాషామహంబొ
దూసికొనివచ్చు పిట్టలు కూసినట్లు.

ఆమ్రకిసలయంబు లంటనాకిన కోకిలము వనంబంత పంచమము నింపె
ప్రాభాతవికసితాబ్జాతకింజల్క మధుర షడ్జమము నింపె చిరుతభృంగి
సంధ్యాసమయముల సైకతంబులపైన సరళధ్వనుల నింపె సన్నయేరు
పర్వదినముల నుభయసంధ్యలను స్నిగ్ధనాదంబు చేసె సంద్రముల రాజు
నా శ్రవోరంధ్రములకు ననారతంబు మధురనాదప్రశస్తి సామాన్య మయ్యె
ఈ యలౌకికనాదం బదిట్లపూర్వ దివ్యలోకానుభూతి నందిచ్చు నాకు.

నేను ప్రబుద్ధమూర్తి నని నింగికి నిచ్చెన లల్లినాను, దే
శానికి నొజ్జబంతినని శాటి బిగించితి నింతదన్క— నా
మానస మీ యపూర్వరసమాధురి గుర్తిడలేకపోయె— ప్రా
౧ ణానిలముల్ తపస్సమయనైశ్చలభావము పొందగల్గియున్.

దూరదూరాన స్నిగ్ధగంభీర మగుచు
సన్నిహితమైనకొలది ప్రశాంతమధుర
దివ్యనాదంబుగా నరుదెంచి వచ్చి
మామకీనాత్మజత్వమై మారిపోవు.

తెలిసికొన్నాను నూత్నసందేశ మిపుడు
ప్రాణ మగ్నిసంయోగమై పరిఢవిల్లె
బ్రహ్మదండషట్చక్రమార్గమున వచ్చి
మామకీననిత్యతపస్సమాధివేళ.

# కేతవరపు రామకోటిశాస్త్రి | విమర్శకులు-విమర్శనము

అసలు విమర్శకుని వ్యాపారమే సాహిత్య ప్రక్రియాంతస్సత్వసంబంధి. తన తాత్పర్యమును వినియోగించి ఆధికారికముగా గ్రంథమును మీమాంస చేయుట. తాత్పర్య మనగా అభిప్రాయమని. అది ఊరక గాలిలో పుట్టదు. దానికొక సంప్రదాయమున్నది. దాని అసలు తత్వమును దర్శించిన వివక్షహేతువుగా తాత్పర్యము పుట్టును. వివక్షబుద్ధినిష్ఠము. బుద్ధి వ్యక్తినిష్ఠము. వ్యక్తి దేశము కాలము చదువు వీనియొక్క సమష్టిస్వరూపము. దేశము కాలము ననుసరించి భిన్ననాగకరతలచేత పాలింపబడు గుణముకలది. ఏ నాగరకత అధికారము వహించునో అది ఆ దేశమును ఆ తన చదువు చదివించును. ఆ నాగరకత ఆ చదువు ఏతద్దేశ సంస్కృతీ సంప్రదాయానుగుణము కాకపోవుట కూడ ఉన్నది. ఆ నాగరకతలో ఆ కానిచదువు చదువుకొన్న సామాన్యులకా నాగరకత ఆ చదువు తమవి కాని పై మెరుగులన్న జ్ఞానసంపత్తి కుదురదు. కుదురక ఏతన్మార్గమున బుద్ధి ప్రసరించును. బుద్ధి ఆలోచనా పటుపు. దాని ఆలోచన ఆ మార్గమును పట్టును. తాత్పర్యమేర్పడుట కాలోచనమూలము. తనకైనది కాని ఆలోచనాధ్వమున పుట్టిన తాత్పర్యమును తనదికాదు. అనగా అది తన సంప్రదాయము ననుసరించి వచ్చిన తాత్పర్యము కాదు. కాకపోయినను అది తాత్పర్యమే.

దేహమున కారోగ్యమెట్టిదో బుద్ధికి స్వతంత్రత యట్టిది. మర్యాదావధిభూతమైన బుద్ధి శక్తికి స్వతంత్రత యనిపేరు. అది యొక ధ్యేయము ననుసరించి సాగునది. తన సంస్కృతీ సంప్రదాయములను గర్భస్థములు చేసికొన్నది. బుద్ధి పరిణతికి చదివిన చదువు ఉపస్కారకము. కాని చదువు చదివినప్పుడు దాని పరిణతి యట్లే యుండును. సామాన్యముగా నట్లే యుండును. అట్లుగా ఐన బుద్ధి తాను చదువని చదువు తనదేదో యున్నట్లు తెలిసికొని దానివైపు చూడగా అది సవ్యముగా కనిపింపదు. పూర్తిగా అపసవ్యముగా కనిపింపదు. అట్లగుటకు హేతువు ప్రపంచకములోని అన్ని చదువుల ఆంతర్యమును జ్ఞానాభిముఖమై యుండుట. ఏతదభిముఖముగా సాగు నాంతర్య నిరూపకములు మార్గములుకూడ కొన్నికొన్ని భిన్నములు కాకుండుట. భిన్నములు కాని ఆయా మార్గము లెరుగుట తనవైనవాని దర్శనమున పుష్టిని గూర్చును. విమర్శన మన్నది విద్యాబుద్ధ్యభివృద్ధి నాశ్రయించి పెంపొందిన శక్తికార్యమగుట, స్వభావజన్యములును సుషుప్తసూత్రస్వరూపములు కానివియును ఐన అభిప్రాయములును అభిరుచులును అస్పష్టముగా గల జనసామాన్యము మాటవంటిది కాదు. అట్టి సామాన్యులు సాంప్రదాయికమైన చదువు చదువుకొన్నను చదువుకొనకపోయినను నొకటే. అనగా ఏ చదువు చదువుకొన్నను బుద్ధి పరిణతమగుటయు అది యొక ధ్యేయము ననుసరించి సాగుటయు ముఖ్యము. అట్టిది స్వతంత్రబుద్ధి. అది తాను చూచు వస్తువును తానుగా చూచునది. చూచినదానిని సహేతుకముగా వ్యాఖ్యానించునది. ఆ వ్యాఖ్యానముతో నీవేకీభవించుట గాని ఏకీభవింపకపోవుట గాని వేరు విషయము. వ్యంగ్యము నాశ్రయించిన ధ్వని కావ్యాత్మయైనచో వ్యాఖ్యానాత్మకము మీమాంస విమర్శనము. ఏతద్వ్యాఖ్యానము స్వతంత్రబుద్ధియైనవాడు చేయగలిగినపని. ఏవం

విధమైన స్వతంత్ర బుద్ధులు వెనుకటి వ్యాసమున నా చెప్పిన నలుగురు.

సాహిత్యమన్నది సర్వమును విమర్శనయోగ్యము. విమర్శకులు తమ తాహతులనుబట్టి తమ యభిరుచినిబట్టి ఒకటి రెండు సాహిత్య ప్రక్రియల నెన్నుకొందురు. అందన్ని గ్రంథములును విమర్శన యోగ్యములు. మరియు నందు కొందరు తమ తాహతునుబట్టి తమ యభిరుచినిబట్టి ఒకటి రెండు గ్రంథములను గాని ఒకరిద్దరు కవులనుగాని విమర్శింతురు. దేశమున నిందరు కవులుండగా— ఇన్ని కావ్యములుండగా— నీవా వానినే పట్టుకొని యుందువేమి? అన్న ప్రశ్న నూహించువాడు వివేకము లేనివాడు. దేశమున నిందరుండగా ఆ పదిమందే యేల కవులు గావలయును? అందా ఒక్కడే యేల మహాకవి కావలయును? అన్న ప్రశ్న లెంత తెలివితక్కువతనమును స్పష్టము చేయునో ఆ పై యూహాయు నట్టిదే— ఒక కవిని గూర్చి ఒక గ్రంథమునుగూర్చి అవిచార మూలక మనుకూలాభిప్రాయము గాని ప్రతికూలాభిప్రాయముగాని దురభిమానియైన మానిసి కుండును. అతడు విమర్శకుడు కాడు. ఏత దభిప్రాయము లవిచారమూలకములని ఎట్లు తెలియు ననగా వాని వ్యక్తీకరణ మార్గమునుబట్టి తెలియును. అందు సహేతుకము తదాంతర్యనిరూపణముగాని తద్వ్యాఖ్యానముగాని యుండదు. అందువల్లనే అవి అవిచారమూలకములు— ఒక కవికృతిని విమర్శించుటకు వేరొకడు కవియే కావలయును. 'కవిరేవ విజానాతి కవేః కావ్య పరిశ్రమమ్.' నిజము కాబోలు నన్నట్లున్న సిద్ధాంతమిది. ఆ సంస్కృతములో నున్నది మరొక పాదముతో కలసిన శ్లోకము. 'నహి వంధ్యా విజానాతి గుర్వీం ప్రసవ వేదనామ్.' ఒక కవి ఒకకృతిని వ్రాయుట కెంతగా శ్రమించుననగా ఒక గర్భవతి బిడ్డను కనుటకు పడిన శ్రమ యంత. ఆ శ్రమ అట్టివాడైన మరొక కవికి తెలియును. అట్టిదైన మరొక తల్లికి తెలియును. ఇది నిజము. మరియు నిందొక చమత్కారమున్నది. ఒకర్తుక మూడు దినములు కష్టపడి అంగాంగములు కుదురుపడని ప్రాణవంతముగాని ఒక మొండెమును కన్నచో ఆమె అందుకుగాను పడిన శ్రమ ఆ మొండెమున కంగాంగములు కుదురుపరచి ప్రాణవంతము చేయజాలదు. అట్లే కవియును. కావ్యమును. కవి ఆ కావ్యమును వ్రాయుటకు పడిన శ్రమ విమర్శన కెక్కు విషయము కాదు. కవి కృతము కావ్యములోని అంతస్సత్త్వ నిరూపణానుగుణము వ్యాఖ్యానాత్మక మీమాంస విమర్శనముగాని మరొకటి కాదు. 'కవిరేవ విజానాతి కవేః కావ్యపరిశ్రమ' మన్నదానికి సరియైన యర్థము చెప్పినచో ప్రతి కవిమాత్రుడును తన వ్రాసినది బాగులేదన్న విమర్శకుల నుద్దేశించి చదువుట కది పనికిరాదు. కవిరేవ యనగా కావ్య నిర్మాణ కుశలుడని, వట్టి వర్ణనా నిపుణుడు కాడు. వస్తువుయొక్క ఆత్మధర్మతత్త్వ దర్శనము కలిమిని వర్ణన చేయువాడు. అనగా రసభావములను విమర్శించుకొని చేయువాడు. అనగా చర్వణాత్మయగు రసము ప్రతీయమానమగునట్లుగా సర్వమును నిర్వహించువాడు కవియన్నమాట. ఆ సర్వ నిర్వహణము జరుగుటకు బహుముఖ శిల్పమార్గములున్నవి. ఆయా శిల్పమార్గములద్వారా ప్రతీయమానమగుచున్న రసమును చర్వణముచేయువాడు కవిగాని కవియన్నమాట. అనగా విమర్శకుడు. ప్రతీయమానార్థ్వ నిరూపణమే విమర్శనము చేయగలదు. రసభూముల పొలిమేరలుదాటి లోనికి ప్రవేశించినచో విమర్శనములేదు. ఏ తదర్థమును సుష్ఠుగా నిర్మించుటే బహు పరిశ్రమతోకూడిన పని. దాని ననుగమించినపుడే రసభూములు. దానిని పట్టించుకొనకుండ ఇక్కడ శృంగారరసము రమణీయముగా నున్నది. ఇందు కరుణరసము చిప్పిలుచున్నది. హాస్యము జాలువారుచున్నది—ఇత్యాది శీర్షికలతోడి యుదాహరణములు చూచుకొను వానికి కవియొక్క కావ్యపరిశ్రమము తెలియదు.

తెలియనివాడు విమర్శకుడుకాడు—ఆ శ్లోకపాదార్థమిట్టిది. ఇట్టి దనగా ఇట్లర్థము చెప్పవలయును. అపుడే దాని ప్రామాణ్యము. లేనిచో లేదు. లేదనగా నీవు నా వ్రాసిన సర్వమును గొప్పగానున్నదనుము: నేను నీ చేసిన సర్వమును మనోహరముగా నున్నదందునుగా సాగెడు వ్యాపారసరణి నాగరకతా భావము ప్రాణము పోసికొన్నట్లు. పరిమితమైన వైజ్ఞానిక జీవన మేతద్భావముతో విషమించుట మంచికికాదు—విమర్శనము కృతిలోని గుణములను వెలికితీసి చూపవలయును గాని దోషములను గాదు. పరమశివుడు గరళమును కంఠమందె యదుముకొన్నాడు. చందిరునే నలుగురికి కలిపించునట్లు శిరమున ధరించినాడు. ఇదియు నిజము కాబోలునన్నట్లుగా నున్నదే. దోషముల నెందుకు చూపరాదు? వాడు చేయవచ్చును గాని వీడు చూపింపరాదనుట యేమి? దోషములు ప్రతి కృతిలోను నుండును. దోషములు చేయని కవి యుండడు. అందువలన వానిని వ్రేలుపెట్టి చూపింపరాదు. గుణములేనా ప్రతి కృతిలోను నుండనివి? గుణము నాశ్రయించని కవియుండునా? గుణములు ప్రతి కృతిలోనుండును. దోషములుగూడనుండును. దోషములు చూపింపరానిచో గుణములనుచూపింపరాదు. ఇక విమర్శనమేపుట్టదు. పుట్టకపోవుటకూడదు. పుట్టి తీరవలయును. చమత్కారాభిముఖముగా నున్నది. అసలువిషయమేమనగా గుణదోషములు రెండును చూపవలయునని. కొండొకచో దోషమంతగా గణనీయముకాదని. కొండొకచో అన్నదాని యర్థము శివుని ప్రసక్తి తెచ్చుటలో నున్నది. క్షీరసాగర మథనము సమయమునగదా శివుడు గరళమును కంఠమునం దదుముకొన్నది? అమృత రసమును పొందుట నుద్దేశించి జరిగినదా సముద్ర మథనము. ఏతన్మథనము జరుగు కాలమున మధ్య మధ్య నందునుండి లోకోపకారకములైన బహువస్తువులతోపాటు లోకాపకారియైన విషమును పుట్టినది. అసలు యత్న ముదాత్తమగుటను మధ్య వచ్చిన లోకాపకారి వస్తువును శివుడు లోకము మీదికి రానీయకుండ మ్రింగి ప్రధానమైన అమృతరసము మూర్తికట్టిన చంద్రుని ఎత్తి నెత్తిన పెట్టుకొని లోకమునకు చలువనుప్రసాదించినాడు. సముద్రము కావ్యము. అమృతరసము కావ్యరసము. ధన్వంతరేత్యాదులు కావ్యగతములైన బహు గుణములు. గరళము కావ్యగతము దోషము. అన్ని గుణములతో శిల్పానేకమార్గాభిరామముగా కావ్యరసాభిముఖమై వస్తువు క్రమముగా నిర్వహింపబడినపుడు ఎటనేని కించిద్దోషమున్నచో దానిని లోకులముందుంచుటకంటె గణింపకుండుట మంచిది. కొండొకచో ననగా నిట్టిది. కాని ప్రకృతకాలమున నీవా దోషమును గణింపక గుణబాహుళ్యము నాశ్రయించి రసాభిముఖముగా వ్యాఖ్యానాత్మకము మీమాంస చేసినచో మరొకడు కేవల మా దోషలేశమునే ప్రదర్శించుట సంభవమగుట మూలముగా గుణదోషములు రెండును విమర్శనమున వెలికి రావలసియేయున్నవి. దోషమేలేని కావ్యముండునా? ఉండవచ్చును. గుణము లేనిదున్నట్లు. ఇది క్వాచిత్కము.

ఒక విమర్శకుడు నిరూపించిన గుణదోషములు మరొక విమర్శకునకు గూడ నట్లే కన్పించునా? కన్పించుటగాని కన్పింపకపోవుటగాని నిష్కర్షించుటకు వీలుకానిది. రెండును సంభవములు. కావ్యాత్మను దర్శించి నిష్కర్షించుకొన్న పద్ధతులనుబట్టి రెండును సంభవములు. రెండును సంభవములన్నచో నందేది ప్రమాణము? ఇచట నొక విషయము చెప్పవలయును. ఒక ఫలానా కావ్యము నాకర్థమైనట్లే నీకు కాదు. నీకుకానట్లే మరొకనికి కాకుండదు. మన మన యనుభవసమర్థములైన హృదయముల పరిపక్వతను బట్టి, మన మన యాలోచనా పటువులైన బుద్ధుల పరిణతిని బట్టి కావ్యపరమార్థ మర్థమగుట యుండును. ఈ సర్వ సంభారముతో అందేది ప్రమాణమని ఆత్మసమాధానపడునో అది ప్రమాణము. అదే ప్రమాణమని నీవు

స్థాపించుటకు దానిని కాదన్న వాని సిద్ధాంతమును నీ ఆలోచనఫలమైన తర్కముతో ఖండింపవలయును. ఆ నీయాలోచన కావ్యపరమార్థ నిరూపణాత్మకముగా నుండవలయును. కావ్యపరమార్థము ధ్వనిగర్భము. ఈ ధ్వనిని కావ్యవిమర్శకులందరు నొకే విధముగా విందురా? అందరును నొకేవిధముగా వినకపోవుట యున్నది. భిన్న భిన్నములుగా విన్నవారు ఈ ఈ విషయములిందు ధ్వనించుచున్నవన్నపు డేది ప్రమాణము? అసలీ ధ్వనించుటలన్నింటిని కవి యుద్దేశించినాడా? ఉద్దేశించినవాడిన్నియు నుద్దేశించినాడనుట న్యాయమా? న్యాయాన్యాయముల విషయ మటుంచి ఒక విషయము మనవిచేయుదును, విమర్శకుడు కావ్యపరమార్థము ఫలానా అని ఈ యీ విషయములు ధ్వనించుచున్నవని చెప్పినపు డాయా విషయములా నిరూపిత కావ్యపరమార్థాభిముఖములై తదుత్కర్షాపాదకములైనపుడు కావ్యము వ్రాయునపుడు కవి వాని నుద్దేశించినాడనియే సిద్ధాంతము. ఇంకను కవి యుద్దేశింపనివానిని ధ్వనులని నీవుగా కల్పించుచున్నావన్నచో, తాను వాని నుద్దేశింపలేదని కవి గానివచ్చి నీతో చెప్పిపోయినట్లు ఋజువుచేయలేవు గదా? కనుక మన ముభయులము కావ్యపరమార్థముమీద నాధారపడవలసినవారమే యగుచున్నాము. బహుకాలము లందున్న విమర్శకులు కావ్యజగత్తును బహువిధ ధ్వన్యర్థములను బట్టి వ్యాఖ్యానాత్మక మీమాంసచేయుట యున్నది. అనగా నా కావ్యమునందున్న వాక్సమూహము దాని సర్వార్థముతో కూడుకొనియున్నదన్నమాట. వాక్కు (శబ్దము) అర్థబోధన సమర్థము. ఏతదర్థమును నియమించునది సంబద్ధత. సంబద్ధత యన్నది కావ్యపరమార్థ సంబంధి. కావ్యపరమార్థ మనగా అఖండార్థ ప్రతీతి. తత్ప్రతీతి ధ్వనిగర్భము. ధ్వని యనగా బహ్వర్థ ప్రతిపాదన సమర్థమైన వాక్కునుండి తత్కావ్యపరమార్థ నిరూపణ సమర్థములు అర్థములు వాచ్యాతిశాయి రమణీయములై స్ఫురించుట. ఆ స్ఫురణము వర్ణమాదిగా రసాంతము వ్యాప్తము. అనగా వర్ణపదవాక్య సంఘటనము ద్వారా ధ్వని రసాభిముఖముగా సాగును. అనగా ధ్వనిగతి కవియన్నియు సహకారులు. ఏతద్వ్యాప్తి లక్షణము తెలియనివానికి కావ్యమునందలి అఖండార్థప్రతీతి కలుగదు. కలుగక విమర్శకుడు కాడు.

కావ్యమునకును కవిజీవితమునకును తత్కాల సామాజిక వ్యవస్థకును సంబంధముండదా? ఉన్నచో విమర్శనమునం దవి చేరవా? పూర్తిగా సంబంధముండుననియు, అవి విమర్శనములో చేరుననియు చెప్పుట ఈ వ్యాసకర్త కిష్టము కాదు. కాదనగా తర్కసహము కాదన్నమాట. కవిజీవితముగాని, సామాజిక వ్యవస్థగాని కావ్యమునం దనివార్యములన్నది సిద్ధాంతమన్నచో నాయావిషయములు చారిత్రకులకు సంబంధించినవిగాని విమర్శకులకు సంబంధించినవికావు. కవిజీవిత విషయముగాని తత్కాల సామాజిక వ్యవస్థగాని కావ్యమునుండి మనము గ్రహించుట మన యూహామీద ఆధారపడినది. ఊహ యనగా ఔను కాదనుటకు వీలు చిక్కనిది. ఇట్లన్నచో నొక ప్రశ్న పుట్టును. నీవు ధ్వని యని చెప్పు సర్వవిషయము నీ యూహయే కదా? అచట నీ యూహ నిజమై మా యీ యూహ నిజము కాని దగునా? అని. ధ్వనివిషయమున నీవు చెప్పిన ట్లూహ మూలముగానున్నను అది కావ్యపరమార్థమున కుపస్కారముగా నిరూపింపబడినపుడే ధ్వనియగుచున్నదని మనవిచేసుకొని యున్నాను. ఒక పరమార్థము నుద్దేశించి వ్రాయబడినది కావ్యము. కవి తన జీవితచరిత్రను - తన సాంఘిక పరిస్థితులను తెలుపు నిమిత్తము కావ్యము వ్రాయడు. వ్రాసినచో నది కావ్యము కాదు. మరొకటి యేదో కావచ్చును. మరొకటి యేదో కాక కవితా సామగ్రీ సమగ్రములుగా చెప్పబడు గ్రంథములలోనే తత్కాల సంబంధి సాంఘికాచారము లున్న ట్లుదాహరణములతో నిరూపణము

జరిగినదిగదా యన్నచో అందుకే మనవి చేసినాను పూర్తిగా సంబంధముండు ననుట యిష్టము కాని దని. ఏమనగా సాంఘికాచారముల నిరూపణము దానికది కావ్యపరమార్థము స్థాపించుటకు సమర్థము కానిది. కాని దానికీ విమర్శనముతో సంబంధము పెట్టరాదు. "గోర్వెచ్చని చమురంటుకొనిరి మస్తకముల జలకమాడిరి నిశామిళితవారి" అన్న రామకృష్ణుని పద్యము నాటి పామరవనితల పర్వదినములందలి యలంకరణమును యథాతథముగా చెప్పుచున్నదన్న దానితో నేను వివాదపడనుగాని ఆ చెప్పుట కావ్యవిమర్శనములో చేరదని మాత్రమే మనవి. ఏమనగా నావ్యాసము వ్రాయుటలో రామకృష్ణుని యుద్దేశ మా పామరవనితల నట్లు వర్ణింపవలయునని కాదు. నిగమశర్మ కాపుకోడలుతో లేచిపోవుట కనుకూలముగా ఊరు ఊరంతయు జాతరలో నిమగ్నమై యుండుటను కల్పించినాడు. కాపుసతిని నెత్తికొని పోవ నిందందు నెడరు వేచి యున్న నిగమశర్మ కా యెడరు నట్లుగా కల్పించినాడు కవి. ఊరిలోని జనమంతయు జాతర వచ్చిన దన్న యుత్సాహముతో, జాతరలోని అద్భుతకృత్యములందు సక్తమనస్కులై యెవరును నిగమశర్మ కాపుకోడలు కలసిపోవుట గమనింపకుండుట నా కల్పన సాధించినది. కాపుకోడలును ఊరిలోనివారందరివలెనే జాతరలో నిమగ్నమైనట్లుగా నటునిటు తిరుగుచు ఎవరగుట తెలిసి నిగమశర్మతో కలిసిపోయినది. ఊరంతగా నన్యాసక్తమైయుండుటయే వారి పోవుటను గమనింపక పోవుటకు మూలము. ఈవిధముగా కథాత్మకు సంబంధించిన వ్యాఖ్యానమే విమర్శనముగాని మరొకటి గాదు. మరి యేవిషయ మెట్లు చెప్పవలయును? వినోదమునకుగా చెప్పవలయును. అనుబంధముగా చెప్పవలయును. అనుబంధమే గ్రంథము కాదుకదా! ఇట్లే కవి యభిరుచ్యాదులును. నైషధమునుబట్టి "మిరియంబుతోఁగూడ మేళవించిన తేనెబోరంపులడ్వాలు" శ్రీనాథున కిష్టములన్నచో "జంబీరరసముతో నూనియతో నావంజెట్టిన కిటి" మాంసముకూడ నాయన కత్యంత ప్రియమైనదని చెప్పవచ్చునుగూడ. ఇది విమర్శన పద్ధతి కాదు. ఇటువంటిదే కవికృతము కృతినుండి వాని బహుముఖ పాండిత్యము నిరూపించుట. "కర్కశుడంటకోర్వక.." "మునుపే చంద్రబలంబు గల్గి..." ఇత్యాది పద్యములను ఆముక్తమాల్యదలోనివి పట్టుకొని రాయలవారు జ్యోతిషమునందు పండితులనిగాని, మరికొన్నింటిని బట్టుకొని— "ఆదినారాయణుండాయె నొక్కడ" "జని సాహస్ర బహుప్రయాణమగు" "వెలయించునట్టియొకమణి" ఇత్యాదులు— రాయలవారి ఛాందోగ్యనారాయణ మహోపనిషత్తులతోడి, గీతతోడి, బృహత్సంహిత హలాస్యములతోడి పరిచయమును చెప్పుట వేదము వారు వ్రాసిన యర్థతాత్పర్యముల క్రిందిభాగము చదువుకొన్నట్లు స్థాపించునేగాని విమర్శనముగా నిలువద్రొక్కికొనలేము. ఇంతకును చెప్పవచ్చిన దేమనగా కవిగారి తెలివితేటలుగాని, మరేవిగాని కావ్యపరమార్థముదృష్ట్యా వ్యాఖ్యానింపబడినపుడే విమర్శన మన్నది పుట్టును. నీ విమర్శనము విమర్శనముగా నిలువబడిన తరువాత తోచిన పెర విషయము లనుబంధముగా చెప్పుకొనవచ్చును. వినోదముగా చెప్పుకొనవచ్చును. అది వేరు విషయము. వేరు విషయమని యింతగా నేల చెప్పుచున్నాననగా అవే ప్రధానాంశములన్న భ్రాంతితో, వాని యునికి హేతువుగా కొన్ని గ్రంథములు కొందరు కవులు పరామర్శింపబడుటయు, ఆ పరామర్శ విమర్శనగా చెలామణిలోనికి వచ్చుటయు సాగుచున్నందున. చెల్లుబడిలేని నాణె మసలుదాని వలె చలామణిలోనికి రాకూడదు.

ఒక కృతిని మరొక కృతితోను, ఒకకవిని మరొక కవితోను పోల్చి విమర్శించుట యున్నదికదా? ఆ విషయమున సిద్ధాంతమేమి? సాధారణముగా నీపోలికవిమర్శ యేకవస్తు కృతుల విషయమున వచ్చుచున్నది. వస్తువొకటేయైనను దాని నాయా

కవులు దర్శించిన విధానములో భేదము తప్పక యుండును. పరమమైన చచ్చుకవికూడ తనదన్న దేదోకలుపకుండ మరొకనిది వ్రాయడు. ఆ కలిపిన దాని వైశిష్ట్య నిరూపణము ముందు జరుగవలయును. ఒక కవి ఒక వస్తువును ఒక ప్రక్రియలో సాధించియుండగా నా వస్తువునే మరొకడు మరొక ప్రక్రియలో సాధించుటయున్నది. అనగా నొకడొక పురాణమున నొక కథ వ్రాసియుండగా దాని నొకడు కావ్యవస్తువుగా గ్రహింపవచ్చును. మరొకడు ప్రబంధ వస్తువుగా గ్రహింపవచ్చును. ఇంకొకడు నాటక వస్తువుగా గ్రహింపవచ్చును. ఇవన్నియు ప్రక్రియాభేదములు. అసలు సాహిత్య ప్రక్రియా వైవిధ్యమునుగూర్చి వేరుగా వ్రాయుదును. ప్రకృత మేమనగా భిన్నప్రక్రియలకోసున్న ఏకవస్తువును తత్తత్ప్రక్రియానుగుణముగానే విమర్శింపవలయునని మనకు పరమోత్కృష్టముగా తోచినది పరమోత్కృష్ట మది వేరు విషయము. రామాయణ భారతాదులు సంస్కృతముననున్నవి. తెలుగునను ఉన్నవి. తెలుగు గ్రంథములను విమర్శించుటలో సంస్కృతమును పోలికతెచ్చుట వలయునా అని. సంస్కృత శ్లోకములతో తెలుగు పద్యములను పోల్చి ఇచట మూలములోని రమణీయార్థము విడువబడినదనియు, ఇచట మూలమునకు మెరుగు పెట్టబడినదనియు వ్రాయుటను విమర్శనమనుట ఈ వ్యాసకర్త కభీష్టముకాదు. అట్టి వ్రాతలను పరిశోధనములనిగాని మరొక పేరుతోగాని పిలుచుట యుచితము. అసలు పరిశోధనము రెండు విధములుగా నున్నది. ఒక విషయమునకు సంబంధించిన అజ్ఞాతములైన శతకోటి అంశముల సమాచారమును ప్రోగుచేసి ఒక క్రమము ననుసరించి గుదిగ్రుచ్చి ఏతద్విషయము పుట్టుపూర్వోత్తరము లివ్వియని సిద్ధాంతము చేయుట ఒక మార్గము. ఉన్నదాని నున్నట్లుగా నందొక ఆంతర్యమును దర్శించి తద్దర్శనానుగుణముగా దానిని సర్వమును వ్యాఖ్యానాత్మక మీమాంసచేయుట మరియొక మార్గము. ప్రధానతత్వమునుబట్టి రెండనుటయేగాని సామాన్యముగా నవి రెండును ఇచ్చి పుచ్చుకొను ధోరణిలో సాగి పరిశోధనమగుచున్నది. ప్రకృత మేమనగా నా వ్రాతలటు సంస్కృత గ్రంథముయొక్కగాని ఇటు తెనుగు గ్రంథము యొక్కగాని అఖండార్థ ప్రతీతిని నిరూపించునవిగా లేవు. ఏతన్నిరూపణమే విమర్శనముగా చెప్పుచున్నానుగదా! అందుకని— ఇరువురు తెనుగుకవులు ఏకవస్తువును గ్రహించి గ్రంథములు వ్రాసినారు. ఆ వస్తువుతో తత్పూర్వమే సంస్కృతమున గ్రంథమున్నది. తెనుగు గ్రంథములను విమర్శింపవలయును. సంస్కృతముదాని నటుంచినను తెనుగున రెండున్నవిగదా? ఏమి చేయవలయును? ముందా రెండు గ్రంథములలోను నున్న అఖండార్థమొకటేనా? అన్నదానికి సమాధానము రావలయును. కానిచో విడివిడిగా ఏ గ్రంథమున కా గ్రంథముగా తదఖండార్థము నుద్దేశించి ఆయా గ్రంథములందున్న సర్వరచనయును సాగినదా యన్న మీమాంస చేయవలయును. ఐనచో దానిని నిర్వహించుటయందే గ్రంథమౌచితీజ్ఞాన పర్యాప్తమో నిరూపణాత్మక మీమాంస చేయవలయును. అఖండార్థ ప్రతీతి యొకటే అయి భిన్నప్రక్రియలలో నున్నపుడా వస్తువు తత్ప్రక్రియా ధర్మములచేత నియతమగుచు నెట్లు నిర్వహింపబడినదో నిరూపించునదిగా విమర్శన ముండవలయును. ఒకే పరమార్థముతో ఒకే ప్రక్రియలో ఒకే వస్తువును ఒకే గ్రంథముగా నిద్దరు ముగ్గురు కవు లొకరితరువాత నొకరుగా వ్రాసినపుడు వారిలో వారిని పోల్చుట యెట్లనగా కథాకథనేత్యాది బహుశిల్పమార్గములలోని సామ్యమునుబట్టి. అనగా సాధర్మ్య వైధర్మ్యములనుబట్టి. అవి యెట్లా ప్రక్రియకు లోబడి యేతదఖండార్థ ప్రతీతి కుపస్కారములైన వన్న మీమాంస యుండనే యుండును. ఈ ప్రత్యేకస్థితి ఆంధ్ర సాహిత్యమున నొక్క కవిత్రయమువారికే యున్నది. ఈ యున్నదనుట భాగవతరామాయణముల విషయమున లేదనుట కాదు.

ఇపు డిచట నొక ప్రశ్న యిట్లు పుట్టవచ్చును. తత్తద్ధర్మము లేవో ఉన్నవని సాహిత్యప్రక్రియా వైవిధ్యమును చెప్పినావు గదా? ఆయా ప్రక్రియలో నాయా ధర్మముల ననుసరించి బహుసంఖ్యాకులైన కవులు సాధనచేసి అంతవరకు సిద్ధిని పొందినారు గదా? అట్టిచో నే యైదార్గురో మహాకవులై మిగిలినవారు కాకపోవుట యెట్లు సంభవము? అని. ప్రతీయమానమైన అఖండార్థము యొక్క చారుత్వాతిశయమునుబట్టి సంభవము. శిల్పానేక మార్గాభిరామమైన రచనాధ్వమునుబట్టి సంభవము. చారుతయన్నదాని యునికి యనుభవమూలము గదా? అనుభవము వ్యక్తినిష్ఠముగదా? పైగా నది నిరూపింపనశక్యమైనదిగదా? అట్టిదానిని ప్రమాణముగా స్వీకరించుట యెట్లన్నచో నన్నియును నిజమే కాని వానితోపాటొక సంప్రదాయమున్నది. కాళిదాస భవభూతులు-నన్నయ తిక్కనలు సాధించిన అఖండార్థమునందలి చారుత్వము భారతదేశమున తెలుగుదేశమున సంప్రదాయమును స్థాపించినది. అచట చారుత్వము నీకనుభవమునకై మరొక చోట అట్టిదే యున్నచో కాకపోవుటయుండదు. ఆ మరొకచోట నాకగుట లేదన్నచో నీవైనట్లుగా చెప్పుచున్న ఆ మొదటిచోట గూడ నీకు కాలేదన్న మాట. స్వోత్కర్షకై అనూచానము నభినయించుచున్నావన్నమాట. శిల్పాభిరామమైన రచన కూడ నిట్టిదే. మహాకవుల నిర్ణయ మీద్విధాభూతమైన మార్గము ననుసరించియుండును— మరల నెప్పుడో వ్రాసెదనని వెనుక మనవిచేసిన యా నలుగురిని గూర్చి వ్రాయుటకిది భూమిక. ఇక వారినిగూర్చి అనగా వారి వారి విమర్శనాధ్వములను గూర్చి వ్రాయుదును.

# ఆముక్తమాల్యద రసదృష్టి-మతదృష్టి

వేటూరి ఆనందమూర్తి

(గత సంచిక తరువాయి)

ఈ ప్రబంధమెల్ల భక్తియోగమును బ్రతిపాదించునదే- విష్ణుచిత్తుఁడు, యామునుఁడు, గోదా- వీరందఱును భక్తులే. కాని అర్చనము మొదలుకొని సర్వాత్మ సమర్పణము వఱకునుగల దశలెన్నియో ఈ భక్తుల చరిత్రమున దర్శింప నగుచున్నవి. "గృహ సమ్మార్జనమో జలాహరణమో శృంగార పల్యంకికావహనంబో వనమాలికాకరణమో వాల్లభ్య లభ్యధ్వజ గ్రహణంబో. వ్యజనాతపత్రధృతియో ద్రాగ్దీపికా రోపమో." మాత్రమే చేయఁజాలి యంతకుమించిన యర్హ తల జోలికిపోని విష్ణుచిత్తుని భావమందున్న భక్తియే, భగవ ద్వియోగమునఁ బరితపించి

"అది యొండె భక్తి యెవతే
నెద విశ్లేషైక భీకవృత్తి బ్రియాలా
భ దశ న్మెయిఁ దొరఁగించిన
హదసన యదిగాక యున్న యవి వైశికముల్"

(5-81)

అని సర్వాత్మ సమర్పణము గావించిన గోదాదేవి యెదలో పండినది. ఏమైనను ద 'త్పదస్మృతి నేమరక' మాలదాసరి వలె కైంకర్యము చేయుచుండుటయే భక్తి. అసాధారణమగు నీభక్తి సంస్కారవశమునఁగాని సాధారణముగ నలవడదు. అందుకే మాలదాసరి యనినాఁడు—

"దిక్పాల తను వెత్తి తిరిప తనువుఁదోన
యెన్ని మార్లెత్త మీ యేను నీవుఁ
గేసరి తనువెత్తి కీట తనువుఁ దోన
యెన్ని మార్లెత్త మీ యేను నీవు ?
.... .... ....
సోమయాజుల మెన్ని మార్లము, శ్వపచ
ఖగ కులుల మెన్ని మాఱులు గాము, పాము
గాముల మెన్ని మాఱులు గాము వెండి
కంసరిపు భక్తుల మొకండె కాము గాని" (6-81)

అని అట్లు తపించుటయే భక్తి.

ఈ భక్తి భగవంతునియం దెట్లో భాగవతులందును అట్లే. ఏలన నీ చిదచిత్ప్రపంచమంతయు నాతని శరీరమే; కావున భాగవతుల నతి శ్రద్ధతో పూజింపవలెను. "భాగవత పరిచయ ప్రధానంబువ బ్రాహ్మణ్యంబె కాక భాగవత శ్రీయునుం" గలుగును. అందుకే విష్ణుచిత్తుఁడు తన జీవితమంతయు నా భాగవత పూజకే యంకితముగావించుకొని తరించినాఁడు. భాగవతు లతిథులై విచ్చేసినపుడు విల్లిపుత్తూరిలో భక్తులు "ఎదురేగి సాష్టాంగ మెరఁగి పాద్యం బిచ్చి, నారికేళ కటాస నముల నునిచి...................వార్చిన పిదప సంవాహన మంత్రముల కొనరిచి, తాంబూల మొసఁగి, కుశల మడిగి, పోయెదమన్న దవ్వనిచి, నిరికిఁ దగిన సత్కృతిచేసి, ఖేద మున మగిడి యర్చ...." (1-76) గావించెడివారఁట ; అట్లే విష్ణుచిత్తుఁడును 'అప్రాలేయ పటీరాచల పద్యా యాతాయాత వైష్ణ వావలికెల్లన్" (1-79) న్యాయార్జిత విత్తమున నన్నము పెట్టుచుండెడివాఁడు. జడి పట్టిన నాఁడు కూడ '....నాలుగే న్పొగిపినకూరలు న్వడియము ల్వరుగు ల్పెరుగు న్ఘృతప్లుతిన్' దానే వడ్డించెడివాఁడు. వారికి వలసినసదుపాయములన్నియుఁ గావించెడివాఁడు.

"కదళగభీర పుష్పపుటికాచ్ఛటఁ చేతుల విప్పపిండిపై
గుదురుగనిల్పి, యొపుగతి గూనల నూనియనించి త్రాటము
న్నుదికిన శాటివ్రేల, వదినొక్కటఁ గ్రుంకిడివత్తు రెందరే
వదలక యాతనింట శనివారమున న్పరదేశి వైష్ణవుల్."

(1-83)

అని రాయలు వర్ణించినాఁడు. అంతేకాదు.

"ఆ విష్ణునిధి గేహసీమ నడురే యాలించినన్....ఎం
తేనాగేంద్రశయాను పుణ్యకథలుం దివ్య ప్రబంధాను సం
ధాన ధ్వానము నాస్తికాక బహుతా నాస్త్యుష్ణతా నాస్త్యపూ
పో నాస్త్యోదన సౌష్ఠవంచ కృపయా భోక్తవ్య మన్మాటలున్"

మ్రోయునఁట; అందుకే ఆ యాతువారి బ్రతుకు పలించినది. వైష్ణవుడగుటచేత రాయలు భాగవత సేవను భగవత్కైం

ట్లవతరించుట కర్మానుభవమునకుఁగాదు లోకరక్షణార్థమే.[11] అట్టి యనంతుని స్థూల రూపాంతరము[12] యోగి హృద్గమ్యమై యొప్పుచుండును. ఆ దివ్యమంగళ విగ్రహమును క్రమముగా యోగి ధ్యానించి, మనమున నిలుపుకొన్నచో - నవిద్య నశించును. అపు డా గుణసౌభాగ్యమున నాతనికిని, హరికిని నడుమ గల భేదము జారిపోవును. ఆ స్థితిలో లేవిభేదము నెవ్వరును గల్పింపఁజాలరు. ఇదియే భక్తియోగసారాంశము. దీని ననుసంధించియే ఖాండిక్యుఁడు మధుమథనసాధర్మ్యంబు నొందఁగల్గెను. కేశిధ్వజుఁడు మిథిలలో యోగమున భోగము ననుభవించెను, "ముముక్షువునకు నాశ్రయణీయుం డధోక్షజుండె"అనియే భక్తియోగము. కాని యందొక దోషమున్నది. దాని కంతరాయము కల్గిన పునర్భవంబు నొందించి ముక్తిం జేర్చును. కాని యింతకంటె సులభోపాయము శ్రీకృష్ణుఁ డర్జునునకు బోధించిన శరణాగత ధర్మము. మూలమంత్ర పూర్వకముగా ద్వయము ననుసంధించి "అన్యథా శరణం నాస్తి" యని శ్రీపాదములందు భక్తితో వ్రాలుటే శరణాగతి. ఇంతయు వివరించి తుదకీ భావమునకే రాయలు ప్రాముఖ్య మిచ్చెను. భక్తుఁడు శ్రీపాదములను జేర నర్హుఁడు కానపుఁ డాచార్యుఁడు వాని కాయోగ్యతను గల్పింపఁ జాలియుండును. సాధకుని యయోగ్యత నాచార్యుఁ డాహరించి వానికి మోక్షము నిప్పించును. కావుననే ఆచార్య పూజకు వైష్ణవమున నంతప్రాధాన్యము కల్గినది. ఈ భావమునే భారన్యాసమందురు. దీనిని కూడ రాయలు సోదాహరణముగ నిందు వివరించెను. "హయవదన పదారాధకుండై వేంకటేశుండను నింకొక్క మనీషి మధుమథన మత ప్రతిపాదకంబగు ప్రబంధ శతంబు రచించి శిలోంఛవర్తనం దపంబుసేయం దనకు జరచ్ఛదన శాకదానంబుసేయు నగస్త్యోర్వీరుహంబునకు[13] నిర్వాణంబొసంగం గలడు" (మాలదాసరి కథ) ఇట్లనేక ప్రసంగములలో నగాధమగు పాండిత్యమును బ్రదర్శించి, రాయ లీ యాధ్యాత్మిక విద్యను ప్రపంచించినాఁడు. వైష్ణవ మతమునం దాతని కున్న భక్త్యావేశములే దీనికెల్ల మూలకారణము. ఇంతేకాదు. రాయలకు సమకాలమున నీ దేశమున ప్రచారము వడసిన చైతన్య మతసంప్రదాయప్రభావమును కూడ నీ ప్రబంధమున మన మనుమానింపవచ్చును.

## వీరవైష్ణవము – ప్రచారము

మొత్తముమీఁద రాయల కీ వైష్ణవప్రబంధరచనలోఁ బ్రచారదృష్టి యధికముగ నున్నట్లు దోచును. యామునుల కథలో పాండ్యరాజునకు 'వెట్టిశైవంబు ముదిరిన' దఁట; ఇట్లే 'సంకర దాసమయ్య' లనుటలోను కవి శైవమును దేలఁ బలికినాఁడు. (వారి చేష్టలు నందుకుఁ దగియే యుండెనేమో.) 'శివలింగము దాల్చినవాఁడు చేయనిది పాప' మఁట; ఈ విమర్శ విశదము. అంతటితో నాగక కవి విభూతి పూసికొని, సూతసంహితల నిరికించుకొని తిరుగు పాదువారల నిందు కడిగివైచినాఁడు. ఇదియెల్ల నా కవి కున్న వీర వైష్ణవాభినివేశమునే చాటుచున్నది. తదనుకూలముగనే యిందు 'విష్ణుదేవుఁడే పరతత్త్వ' మనియు, 'విశిష్టాద్వైతంబె మతం' బనియు వచనము లున్నవి. అట్లే స్వామియు 'వనజజ రుద్రాదులు మత్తనువులె అన్లైనం గలవు తరతమ వృత్తుల్' అనుచుఁ దన్నే గొలుచుట యుక్తమని చెప్పిన ఘట్టములు నిందు లేకపోలేదు. ఇవి యట్లుంచి రాయల వీరవైష్ణవత కొండు రెండు ప్రసిద్ధోదాహరణము లిట నుటంకింతును—

పెరియాళ్వారుల కథలో మన్నారుస్వామి కలలో గోచరించి యాళ్వారులను హెచ్చరించుచు 'వాఁడును రోసినాఁడిహము వైష్ణవుగా నొనరింపు సత్కృపన్' అనిన ట్లున్నది. ఈ వాక్యమున రాయల స్వరూపము మన కవగతము కాఁగలదు. అగ్రవర్ణములవారిచేత ననాదరింపఁబడిన పంచములకు సానుభూతితో మతాంతర మిప్పించిన నేటి పాశ్చాత్యక్రైస్తవమిషనరీల కున్న చాకచక్య మిందు కాననగుచున్నది. పాండ్యరా జగు మత్స్యధ్వజుఁ డిహమును రోసినాఁడఁట; వానికి వైష్ణవ మిప్పింపవలెనఁట; ఇందలి 'రోయు', 'ఒనరించు' ధాతువు లర్థయుక్తములు. వైష్ణవమున మూలగ్రంథకర్తలకన్న నీతఁ డొక యా కెక్కువ చదివినట్లున్నాఁడు. ఇట్లే మాలదాసరికథలోను రాయల వ్యక్తిత్వ మెట్టిదో గోచరించును. మాలదాసరిని బ్రహ్మరాక్షసుఁడు

---

11. "జగతాముపకారాయ నసాకర్మ నిమిత్తజా" విష్ణువు.
"స్వలీలయా జగదుపకారాయ స్వేచ్ఛావతారం" వే. సం.

12. "శరదిందు చకచక స్మయజిత్ప్రసన్నాస్య....శంఖరథాంగాదు లలరువాని. (౩-౯౫)

13. చూ.... వేదాంత దేశికులవారి చరిత్రము. భారన్యాసమున కింత చక్కని యనుభవపూర్వకమగు నుదాహరణము తెలుఁగు సాహిత్యమున మఱి యే కావ్యమందును కానరాదని శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగా రీ విషయము నా కెఱుక పరచిరి.

పట్టుకోఁగా నాతఁ డెన్నోతీరుల వానిని బ్రతిమాలుకొనును. కాని వాఁడు మాట వినఁడు. తుదకు మాలదాసరి యిట్లని ప్రమాణము చేయును.

"ఎవ్వని చూడ్కిఁ జేసి జనియించు జగంబు, వసించు నిజ్జగం
బెవ్వనియందు, డిందు మఱియెవ్వనియందిది యట్టి విష్ణుతో
నివ్వల నొక్క వేల్పు గణియించిన పాతకినౌట నేఁడ నే
నెవ్విధినైన నిన్గదియనేని, యనవ్విని బంధ మూడ్చినన్"
(6-43)

వరాహ పురాణాంతర్గతమగు నీ గాథను భోజరాజీయమందలి కొన్ని గాథలను, మఱికొన్ని స్థల పురాణములందలి గాథలను ననుసరించి యీకవి యిట్లు తన కాలమునకు, భావములకు ననుగుణముగా మలచుకొనినాఁడు. ఆ మూలకథలలో నా యా పాత్రల సత్యసంధతయే వానిని గాపాడినది. కాని యిందు విశేషమున్నది. మాలదాసరి యెన్నో బాసలను, బందికండ్లను[14] గావింపగా వానినెల్ల బ్రహ్మరాక్షసుఁడు త్రోసి వైచినాఁడు. అతనికేమియుఁ దోపక యాపత్సమయమున తుదకు 'అట్టి విష్ణుతో నివ్వల నొక్క వేల్పు గణియించిన పాతకినౌదు' నని ప్రమాణము గావించినాఁడు. తోడనే జాత్యన్నముగా నరమాంసమునే భుజించుచుండిన బ్రహ్మ రాక్షసుఁడుకూడ మనసుకరఁగి, విశ్వసించి, వదలివైచినాఁడు. ఆ బ్రహ్మరాక్షసుని మాటయేమోగాని రాయలమ్మం దెవరైన నట్టి ప్రమాణము చేసియుండిన వెంటనే వారి ననుగ్రహించెడివాఁడే యనిపించును, రాయల సంస్కారము బ్రహ్మరాక్షసునినైత మావేశించినది.[15] ఈ పై యంశములఁ బరికించిన రాయల హృదయ మెట్టిదో- అతని వైష్ణవాభిమాన మెట్టిదో తేటతెల్లము కాఁగలదు.

## స్తుతులు - అవతార వర్ణనలు - ప్రకృతి వర్ణనలు

కావ్యారంభమందే విపులముగా నిష్టదేవతా స్తుత్యాదికమును రాయలు గావించెను.

'శ్రీ కమనీయ హారమణి' యను మొదటి పద్యమందు 'లక్ష్మీ విశిష్టుని వేంకట భర్తను ప్రధానీకరించుటచేత కవి యీ ప్రబంధమందు విశిష్టాద్వైత మతము ప్రతిపాద్యమని సూచించినాడు' (వేదంవారి వ్యాఖ్య).

ఆ పై 'హరి దన్జేర న్నప్రిహర్షించు సుర్వరకు న్వంచవఁ గూడఁగాఁ గలుగు భాస్వచ్చంద్రశాలా పరంపరలయ్యె న్నుఖ పైన యెవ్వని ఫణాపంక్తు' లయ్యనంతుని భజించినాఁడు (ఆ. మా. 1-2). ఇం దనంతునకుఁ బొగడ్త యేలనఁగా నుర్వర కా సౌభాగ్యము గల్పించినాఁడు కాఁబట్టి; కాఁగా 'ప్రహర్షించు నుర్వర' యనుటలోఁ గవి రాగభావమును సాత్త్విక భావోదయముతోడ వర్ణించి నట్లైనది. అందుచే ప్రబంధమందలి ప్రధానరసము శృంగార మనియు—నందును దివ్యశృంగార మనియు—ధ్వనింపఁబడుచున్నది. అంతేకా కిందు విశిష్టముగా కావ్యార్థము కూడ సూచిత మగుచున్నది. ఈ ప్రబంధమందలి నాయిక యగు గోదాదేవి భూదేవి యవతారమని వైష్ణవసంప్రదాయము తెల్పుచున్నది. అట్లగుట నాముక్తమాల్యదారంగనాథుల సమాగమమే యిందలి యితివృత్తమని పై పద్యమునుబట్టి తెలియుచున్నది. ఇదికాక మఱియొక నిగూఢవిషయము కూడ నిం దనుమానింప నగుచున్నది. గోదారంగనాథుల సమాగమమున కాశ్రయము గల్పించినవిందు 'భాస్వచ్చంద్ర శాలా పరంపరలై' యొప్పిన యనంతుని ఫణాపంక్తులు. అనఁగా నేతదుపాధిపై వారి సమాగమ గాథ జరిగిన దన్నమాట. వైష్ణవసంప్రదాయజ్ఞులు శ్రీమద్రామానుజుని ననంతుని యవతార విశేషముగాఁ బేర్కొందురు. ఆ మహనీయుని ప్రజ్ఞాప్రాదుర్భూత మగు మతతత్త్వమే విశిష్టాద్వైతము. దాని నాశ్రయించియే—తదనుగుణముగనే—ఈ యాముక్తమాల్యదారచన సాగినది. కావున నిందలి యనంతునిస్తుతిలో నుదయవరుల ప్రశంసయు నిట్లు వింతగా సమకూడుటన్నది కవికిఁ గల సంప్రదాయ పరిజ్ఞానమునే చాటుచున్నది.

అటుపై స్తుతిపద్యము గరుత్మంతుని గూర్చి "పతగ సమ్రాట్పత్ర ప్రభంజనములు వృజినతూలౌఘములఁ దూల

---

14. "బాసలు బందికండ్లు మరి ప్రాణ భయంబున లక్ష నేసినం గ్రాసము కృచ్ఛ్రలబ్ధముదుగన్వసమే ?........" అన్నదానికి వేదంవారి వ్యాఖ్య "బాసలు - ప్రతిజ్ఞలు, బందికండ్లు-నిలుకడలేనివి" అని యున్నది. కాని బంది కండ్లమట కము సన్న లనుట కని "బాసలట, బంది కండ్లట, చేసన్నల విన్నవారు చెప్పిరి నాతో" అను శుకసప్తతి పద్యము ననుసరించి నే నర్థ మూహించుచున్నాను. బందికండ్లు - (బందిచక్రముల వలె గ్రుడ్లు త్రిప్పుట) కన్ను సన్నలు.

15. ఇందొక కథా కథన చమత్కృతియు కలదు. ఆ రాక్షసున కా సంస్కార మెక్కడిదని ప్రశ్నించుకొన్నప్పుడు సోమశర్మోపాఖ్యాన మా వెంట సమర్థనీయముగనే యుండి, తత్సూచకముగ కూడ నుండును. మరియు నీ పద్యము పోకడ శ్రీమద్భాగవతాంతర్గతమగు ప్రార్థనను దలపించువట్లుండు టింకొక విశేషము.

విసరుగాత" (1-8) మని యొక యూహాతీతమగు భావనగల సీసమును గవి రచించెను. ఇందలి గరుడుని వర్ణన మపాధారణమై చదివినదే తడవుగా పఠితలమనమును భావాంబర వీథిలో నుఱ్ఱూతలూగించువ ట్లుండును. మఱియొక విశేషమేమన 'విష్ణుచిత్తీయ' మను నామాంతరముగల యీ ప్రబంధమున వర్ణితుఁడైన విష్ణుచిత్తుఁ డీ "యవిదిత పురందరాయుధంబైన కనక శిఖరియునుబోలె నెఱకల జిగులు దెసల నింగి నీరెండఁ గాయు వేదాంగు వినత సుతుని" యంశమున నవతరించిన మహాభక్తుఁడే; అట్లగుట నీ పద్యమందును గావ్యార్థ సూచన మద్భుతముగ నున్నదనవచ్చును. "వృజిన తూలౌఘములఁ దూలవిసరు గాత" మనుటలో విష్ణుచిత్తుల వారు పాండ్యుని సభలో వాదమున దుర్మదాంధుల నోర్చి, విష్ణుతత్త్వమును నిరూపించుట సూచితమైనది. ఇట్లే యాపై గావింపఁబడిన విష్వక్సేనుని స్తుతియు[16] పాంచజన్య నందక కౌమోదకీ శార్ఙ్గ సుదర్శనాది వైష్ణవ సంకేతముల[17] వర్ణనములును విశేషముగా కవికిఁ గల భక్తి శ్రద్ధలను, సంప్రదాయ పరిజ్ఞానమును వెల్లడిచేయుచున్నవి.

ఉదాహరణ కిందలి వర్ణన మమోఘముగ నున్నది.

"ప్రతతోర్ధ్వాధర భాగపీఠ యుగళీ భాస్వత్త్సరు స్తంభ సం
స్థితిఁ దీంద్రించెడి జాళువా మొసలి వాదీప్తార్చిగాఁ గజ్జలా
న్వితధూమాసితరేఖ పై యలుఁగుగా విజ్ఞాన దీపాంకురా
కృతి నందంబగు నందకం బఖలతాశ్రేణిచ్ఛిదం జేయుతన్"
(1-6)

భౌతికముగా నందకి స్వరూపమట్లుండుటయే కాక యందొక సంప్రదాయ విశేషముకూడ నున్నది. మొదలాళ్వారులలో నివరి వారగు పేయాళ్వారీ నందకాంశమున జన్మించినవారే. వారి విషయమే ఈ వర్ణనమందు ధ్వనింపబడినది. మొదలాళ్వారులు మువ్వురును దేహళీశుని (స్వామిని) విజ్ఞాన దీపమును వెలిగించి వెదుకఁబోయిరి. అందు తుదివారగు పేయాళ్వారు 'విజ్ఞానముద్వారా లభించిన అనుభవ దీపమును వెలిగించి తత్సాహాయ్యమున స్వామిని సందర్శింపఁ జాలిరి. ఈ గాథను స్మరించుటకే రాయలు విజ్ఞాన దీపాంకురముగా నందకము వర్ణించెను.

ఇట్లీ సంకేతములనెల్ల వర్ణించిన పిదప రాయలు పన్నిద్దరు సూరులనుగూడ నొక పద్యమున భక్తితో స్మరించెను.

"అల పన్నిద్దఱు సూరులందును సముద్యల్లీలఁ గావున్న నె
గ్గలపుందాపముఁ బాప నా నిజమనః కంజాత సంజాత పు
ష్కల మాధ్వీకఝరీ న్మురారి సొగియంగాఁ జొక్కి
ధన్యాత్ములౌ
నిల పన్నిద్దఱు సూరులం దలఁతు మోక్షేచ్ఛామతిం దివ్యులన్"
(1-10)

'సవితృమణ్డల మధ్యవర్తీనారాయణః' అను శ్రుతి ప్రమాణమును బురస్కరించుకొని వర్ణితమైన యీ పద్య మాళ్వారు ఘనతను జాటుచున్నది.

ఇట్లే గ్రంథమం దచ్చటచ్చట నున్న వర్ణనలును, నాశ్వాసాద్యంతములందున్న వర్ణనలును స్తుతిమాత్ర సుందరములై యున్నవి. అందు కొన్నిట భాగవత విష్ణుపురాణములందలి వైష్ణవగాథలు స్మరింపఁబడినవి.[18] మఱి కొన్నిట నా వేంక

---

16. విష్వక్సేనుని వరన మిందే గ్రంథాంతమున మరియొకచోట నున్నది. (7-32)

17. వైష్ణవ సంప్రదాయమునఁ బన్నిద్దరాళ్వారులును వైష్ణవాంశ సంభూతులని యున్నది. విష్వక్సేను నంశమున నమ్మాళ్వారు జన్మించెను. అట్లే యిందు వర్ణితములైన పాంచజన్య నందక కౌమోదకీ శార్ఙ్గ సుదర్శనాంశములతోఁ గ్రమమున పోయిగై యాళ్వారు, పేయాళ్వారు, పూదత్తాళ్వారు, తిరుగుంగై యాళ్వారు, తిరుమళిశై యాళ్వారు జన్మించిరి.

(ఇకఁ గౌస్తుభాంశమునఁ గులశేఖరులు, శ్రీవత్సాంశమునఁ దిరుప్పాణాళ్వారు, వనమాలాంశమున తొండరడిప్పొడి యాళ్వారు నవతరించిరి. ఏతదంశము లిందు విడువఁబడినవి.)

18. (అ) "దైత్యానీత సుర శ్రీపునరానయన క్రమణ"
(ఆ) 'దంష్ట్రికోత్కృత్త హిరణ్యాక్ష క్షపాచర!'
(ఇ) 'భక్త ప్రహ్లాదారచితస్తోత్ర పులకితాంచిత గాత్రా'
(ఈ) 'దవీయస్తర ప్రస్థితాంఘ్రీ' (3-92)
(ఉ) 'దృప్యద్భౌమాహృత సురజనయిత్రీ మణి తాటంక (4-1)
(ఊ) 'గోత్రభిద్భ్రమహారి దోశ్చండి మోత్పులకీ కృతాంగక పత్య' (4-288)
(ఋ) 'అజచార్యాపహృతాత్మతోక సముదాయాభీర కాంతామణి
వ్రజ గోరాజి మనః ప్రమోదకర తద్వత్సాపిత్త రూపానుభావ జవి ప్రాభవ" (6-67)

శ్వరుని యనంత కళ్యాణ గుణములు వర్ణింపఁబడినవి.[19] ఆతని పర్వశక్తి మత్త్వమునింకఁ గొన్నిట వర్ణింపఁబడినది. (ఆ. మా. 2-88) వేఱొక కొన్నిట నాతని యవతార మూర్తులు ధ్యానింపఁబడినవి.

ఇట్లే భక్తితో స్తుతించుచు రాయలు రచనలో తాండవము చేసినాఁడు. ఒకటి రెండుదాహరణములు—

"వకుళాలంకృత యోగిహృన్నిలయ భాస్వత్పాండు
భాస్వన్మయాం
బక నాభీజలజాత సూత విధి సంప్రాప్త స్మరారిష్ట ము
ష్టి కఠోరార్పణ కర్కటీ ఫలితకేశ క్రూర రక్షోంగకా
కృకవాకుధ్వజ దీర్ఘికా[20] ప్లవతప క్రీడోత్సవాద్యుత్సుకా."
(8-90)

భుజంగప్రయాతము :

"బల ద్విద్విపిర్దిష్ట పాథోధరోరూ
పలాసార ధారాతపత్రీ కృతాద్రీ
ఫల న్మూర్ధ చాణూర భంగోగ్ర బాహా
కలాకృత్తకంసా, శిఖండావతంసా." (1-88)

ఈ వర్ణనలలోనే రాయలు కొన్నిట నవతారమూర్తులను కూడ స్మరించినాఁడు.

ఇటకాక ప్రత్యేకముగా కథామధ్యమున విష్ణుచిత్తునిచేత దశావతారములను ఘనముగా స్తుతింపించినాఁడు. ఇవి కేవల పౌరాణిక గాథాప్రభూత చమత్కార కవితాకల్పనలు కావు. భక్తిభావము నుద్బోధించు శబ్దధ్వని గల గంభీర రచనా శిల్పములు. విష్ణుచిత్తుడు వాదమున జయించి మహావైభవముతో విల్లిబుత్తూరున కేతెంచుచుండఁగా మార్గమధ్యమున శ్రీమన్నారాయణుఁ డాతనికి సాక్షాత్కరించినాఁడు.

అప్పుడు అవతారముల[21] నన్నిటిని పౌనః పున్యముగా స్తుతించి యాతఁడు భక్తితోఁ దాండవమాడినాఁడు.

ఇట వరాహ నృసింహావతారములను వర్ణించిన పద్యములను మాత్రము పేర్కొందును.

"ఒకమఱి బుద్దగింప విలయోదకముల్ పయికుబ్బి, చిప్ప వ్ర
చ్చుకొని మహాభ్రవీథిఁ జన, సూకరతన్మెయి పెంచి,
పెంది, క్రిం
దికిఁ గయుఁవ్రాలు తత్పలిల నిర్మలధార నదః పరస్పర
త్ప్రికృతికి పీ యజాండమును బంగరు ముంగరగా
నొనర్పవే." (4-21)

"అసురేంద్రాశయ కుండికాచ్ఛరుధిరవ్యాప్త స్వకచ్ఛాయఁ గాం
చి సముద్యత్ప్రతిసింహ మత్సర మిళచ్చేష్టన్ దదుద్దామ దీ
ర్ఘసటాఝూటముఁ బెల్లగించు గతి నాంత్రశ్రేణిఁ
గిన్కన్ వెరం
జనిత క్రూర భవన్నఖావళులు ప్రోచు న్మర్త్య పంచాననా."
(4-22)

ఈ రీతి వర్ణనలందు కవి యెంత భ్రాంతిజనకముగ నతిశయించి యుత్ప్రేక్షించినను, వాని కూర్పువెనుక గోచరించు నా యా మూర్తులు భక్తిభావ మను దూరదర్శినీయంత్ర సాహాయ్యమునఁ జూచిన, నున్నవానికిఁ బదిరెట్లు విలువ హెచ్చి గోచరించున ట్లని గోచరించును. ఇట్టి రచనామూలక భావ ధ్వనిచిత్రణమే రాయల కవితలోని వైశిష్ట్యము. ఈ గుణము చేతనే రాయలు తక్కిన సర్వాంధ్ర కవిమండలికి భిన్నుఁడై విలక్షణుఁడుగా గోచరించుచున్నాఁడు.

ఇట్లే కవి "అది యొండె భక్తి యెవతే, నెదవిశ్లేషైక భీరు వృత్తిఁ బ్రియాలాభదశన్మెయిఁ దొరఁగించిన హదపన యది గాకయున్న యవివైశికముల్"(5-81) అని గోదాదేవియెదలో మదనవ్యథ ననుభవించు దశలో నామెచేత నా యవతారముల నుపాలంభింపించినాఁడు. అనురాగజనితమైన కోపావేశమున నామె -

"తాను సురమౌని నృపతనుల్ గాల్చి యకట
కామినీతతి నుడికించు కంచె నట్టె
గండెయును నల్లదాసరిగాఁడు కిరియు
హరియు నైపోవుటయ మంచిదను యుగంబు"(5-41)

అని యవతారమూర్తులను లేశముగఁగొని పలికినది. మఱియొక చోట స్వామికి తిర్యగ్జంతు జన్మప్రాప్తికిఁ గారణము కామినీ తిరస్కారణమే యని హేతు సహితముగ నుత్ప్రేక్షించుచు గోద -

---

19. (అ) 'లీలా పార్థషితా' (వద్ది తానులవాఁడా ! అనుటకు) (2-99)
(ఆ) 'శ్రీ నీళా జాంబవతీ మానస తామరస విహరమాణ మిళిందా . ....నానాంఘ్రి శిరోక్షశేషనగ హర్యక్ష"
(5-1)

20. "స్వామి పుష్కరిణి తిరుపతి కొండలలోనిది, కావున దానిచేత శ్రీ వేంకటాచలపతి సూచితుఁడు." వేదంవారి వ్యాఖ్య.

21. అశ్వా 4-18 నుండి 4-31 వఱకుగల పద్యములలోఁ గ్రమముగా దశావతారములు వర్ణితములైనవి.

"ధరపై నీతఁడు పూర్వకల్పమున సక్తశ్రీ విశాలాంబకాం
బురుహశ్రేణి జలంబుపైఁ బులకలన్ బూరించుచున్
వేఁచు దు
ర్భర కర్మం బలమంగవచ్చు జలజత్వ స్తబ్ధ రోమత్వకే
సరితల్పూర్యవతార దంభమున నాచ్ఛాదించుఁదాఁ బ్రౌఢిమై"
(5-44)

అనినది. ఇట్లవతారము లను వ్యాజమున నిందలోనే స్తుతించినది గోదాదేవి.

ఈ విధముగా కావ్యమం దాద్యంత మనేకవిషయములలో వైష్ణవమునే రాయలు ప్రతిపాదించినాఁడు. తుద కాతని ప్రకృతి వర్ణనలలో సహితము వైష్ణవమే గోచరించును.

## వర్ణనలో వైష్ణవము

దర్శన వర్ణనాత్మక శక్తులుగల కవి సాధారణముగా తన కభిమానమగు మత దృక్పథమునుండియే ప్రకృతిలోని వస్తువులను వీక్షించును. రాయలు పరమ వైష్ణవుఁడగుటచే నాతనికి ప్రకృతియెల్ల విష్ణుమయముగనే భాసించినది. విల్లిబుత్తూరులో మన్నారు కృష్ణుని యాలయమునందలి ధ్వజ స్తంభపు చిఱుగంటలు రాత్రులలో మలయమారుతము వీవఁగా మ్రోగుటయు, నా సవ్వడికి కోవెలయొక్క ప్రాకారపు టంచులమీఁది సంపెగ మ్రాఁకుల కొమ్మలలో నిద్రించెడి పక్షులు మేల్కొని రొదసేయుటయు[22] మనోజ్ఞముగా వర్ణించినా డీ కవి. ఆ పద్యమందలి భావము, దృశ్యము నత్యంత సుకుమారములు. ఇట్లే శ్రీ విల్లిబుత్తూరి వర్ణనమంతయు వైష్ణవ ప్రభావమునకు లోనైన దక్షిణదేశ సౌభాగ్యమునే చాటుచున్నది. 'చెంగల్వ దిగ్గియనీ రచ్యుత మజ్జనార్థముకటిం గీలించుచున్ బోవు ద్రవిడ ప్రబంధయుగాస్యల వర్ణనము(1-56) మొదలుగాని 'ఏనుగుదోయి వీరార్చు నపరంజి పీటి వ్రాతశ్రీలు- దశ్పార్శ్వ చిత్రిత శంఖ చక్రముల్ రత్నంపుఁ దిన్నెల ప్రతిఫలించు'టాదిగాఁగల వర్ణనము వఱకు సర్వత్ర ఆ సౌభాగ్యమే భాసించును. బొమ్మల పెండ్లిండ్లలోను, వ్రతపర్వములందును పాటలక్కలుపాడు వైష్ణవ పుణ్యగాథలను, లక్ష్మీనారాయణ గీతములను గని విని, యానందించి, వర్ణించి నాఁటి జాతి జీవనమున వైష్ణవమెంతగా జీర్ణించుకొని పోయినదో మన కెఱుకపరచినాఁడు. అంతేకాదు. ప్రకృతి వర్ణన మొదలుకొని విరహోపాలంభన వర్ణనల వఱకు గూడ నాతనిదృష్టి వైష్ణవమున కెడముగ పోనేలేదు. వర్షర్తువున మబ్బులు రాయలకు మోహినీగాథను స్మరింపజేయును (4-103). వఱదలై పాఱి సంద్రములోఁ గలియు నదు లాతనికి 'ప్రియు న్నిదురపోవు హరి న్వడిఁ గౌఁగిలింపఁగా' 'ధరిత్రి సాఁచు గరుదాలువుఁ గేళ్ళనిపింపఁ జేయును' (4-101). నీలమేఘ మాకసమున నెగయు టాతనికి వామనుని విజృంభణముగా భాసించును (4-105). ఆతనికి మొగిలు 'సకలమును నిద్రవుచ్చు కేశవుని నిద్రవుచ్చు' ఘనవియత్పథార్థముగ తోచును (4-109).[23] అట్లే వసంతమున నాతనికి వామనమూర్తి దర్శనమిచ్చును.

"సాంద్ర మకరంద వృష్టి రసాతలంబుఁ
దొరఁగు పువ్వుల భువియుఁ బూధూళినభము
నీ క్రమత్రయి మాధవుఁ డాక్రమించె
నురు విరోచన జనిత మహోష్మ మడఁగ."(5-136)

ఇట్లే 'సాంధ్యరాగలహరి సామిరంజితమ్మువై- ఇందిరాధిపతికి నెత్తు కర్పూర నీరాజనంబు' అనునట్లుగా శరద్ఘనంబు లాతనికి ప్రతిభాసించును.

"నీరజేక్షణుఁ డవ్వేళ నిద్రదెలిసి యడుగుఁ దనమీఁద మోపనో యవని రమణి కంటకితగాత్రియయ్యె నోఁగావిపాక పరుష కంటక శాలిమంజరులు" పొలిచెనఁట। ఇట్లే వర్ణన లెన్నేని యిందు చూపవచ్చును. ఇట్లే 'వర్షాదినముల పోకడచే మనోహరుఁడైన శరదృతు పురుష'ని చరిత్రము రాయలకు రామాయణగాథను స్మరణకుఁ దెచ్చును. (4-165) ఈ వర్ణనలెల్ల రాయలకుఁగల మత దృష్టినే వెల్లడి చేయుచున్నవి. దీనినిబట్టి వర్ణనా ప్రధానములగు నీ ప్రబంధములపై వైష్ణవ ప్రభావ మెంతగా పనిచేసినదో యెఱుఁగనగును. 'సర్వం విష్ణుమయం జగ'త్తనెడి సత్యము తాత్త్వికముగా ననుభవించిన మహానుభావుఁడు రాయలని తెలియనగును.

---

22. "మలయపు గాలిరేలు వనమాలి విమాన పతాక ఘల్లమం
చలియఁ బసిండి మువ్వగమి నొక్కొకమాటు గదల్ప మల్కమి
న్నలము తదీయ హేమ వరణాంచల చంపక శాఖలందుఁ బ
క్షులు రొదవేయ వేగెనని కూడుదు రల్కలు దీరిదంపతుల్" (1-74)

23. "నారాయణుఁడు వర్షాకాలమున నిద్రలోనుండును. ఆషాఢశుద్ధైకాదశి మొదలు కార్తికశుద్ధైకాదశి పర్యంతము నారాయణునకు నిద్రాసమయము" (వేదంవారి వ్యాఖ్య 4-101). ఇట్టి సంప్రదాయ పరిజ్ఞానమును రాయ లడుగడుగున తన ప్రకృతి వర్ణనలలో ప్రదర్శించెను.

అందుకే చివరకు సరియైన వైష్ణవుని యాకృతినిగూడ విడువ కుండ నిట్లు సోమశర్మోపాఖ్యానమున వివరించి వర్ణించెను.

"స్నిగ్ధ త్రిభాగముండితశిరశ్శిఖతోడ
హిమధవళోపవీతములతోడ
ఋజ్వ్యషడ్విత యోర్ధ్వ పుండ్రవల్లుల" తోడ
తులసికాబ్జస్రగావళులతోడ
గౌపీనకటిసూత్ర కాషాయయుగితోడ
జలపూర్ణకుతపమండలువుతోడ
బాణిస్థదివ్యప్రబంధసంపుటితోడ
నుత్తరవాక్పూర్వ కోక్తితోడ
బసిఁడి జిగితోడ బ్రహ్మవర్చసము పొల్చు
భాగవతలక్ష్మితో ధూమ పటలినుండి
వెడలు శిఖవోలె నమ్మేను వెడలిచూడ
జూడ వైష్ణవుఁడై నిల్చె సోమశర్మ." (7-23)

రాయలును వైష్ణవభక్తుఁడే కద!

## రచన - ద్రావిడప్రభావము

ఆముక్తమాల్యదారచన విశిష్టమై సమకాలిక ప్రబంధము లలో నెత్తి చూపదగినదిగా నుండును. దానికిఁ గారణ మాతని పాండిత్యమును, గొంత యాతని స్వాతంత్ర్యము ననవచ్చును. ఈ రచనలో నడుగడుగున శాస్త్ర పాండిత్యము, పౌరాణిక సంప్రదాయ పరిజ్ఞానము ప్రస్ఫురించుచుండును. అపారమగు లోకవృత్తపరిశీలనము తోడను, స్వానుభవ ప్రకటనోద్యమముతోడను బూనుకొని తొడఁగిన యాతని రచనలో సంస్కృతాంధ్రములు సమశైలిలో నుండును. గద్య పద్య రచనలందు నట్లే ప్రజ్ఞ సమానమై, భావము నిబిడమై, గ్రంథమున కధిక గౌరవము నాపాదించునట్లుం డును. వీనికన్నిటి కుదాహరణము లీ గ్రంథమున లెక్క లేనన్ని చూపవచ్చును. కాని యావని యిట నవసరము కాదని విడుచుచున్నాను. గ్రంథవిషయము వైష్ణవ మగుట చేత రచనయందుఁగూడ దత్ప్రభావము విశేషముగ గోచ రించుచున్నది. దానినిమాత్ర మించుక వివరింతును. అసలీ ప్రబంధ నామమే గోదాదేవి ద్రావిడ నామమగు 'శూడి కొడుత్తాళ్' అనుటకుఁ దెలిఁగింపు. ఇట్లు సాంప్రదాయిక సాంకేతిక ద్రావిడ వైష్ణవ నామాదులకుఁ దెలుఁగుసేయు యత్నమున మన భాష కభ్యుదయము చేకూరిన దనవలెను.

ఈ పద్యమును గాంచుఁడు.

'పొలయుం గాడ్పులుదబ్జహాలయవదంభోజాక్ష వక్షస్థల స్థలభుగ్రజ్మకరంద బిందువులఁ బణ్యారంపుఁ బుణ్యంపు గం పులఁ దాపత్రయి మీటి పీట నటన ప్రోద్యోగ పక్షిభవ ల్లలనావర్ధిత కైశికక్షరిత కహ్లారాళి నల్లాఱ్పుచున్." (1-73)

ఇందలి 'యుత్తరపు గొప్ప కోవెల గలవాఁడయిన హరి యొక్క' అను విగ్రహముగల 'ఉదబ్జహాలయవదంభో జాక్ష' అను సమాసము కేవలము 'వడప్పెరుంగోయిలుడై యన్' అను ద్రావిడ నామమునకు భాషాంతరీకరణము. ఇట్లే 'మన్ననారు,' 'ఆళువారు' మున్నగు పదములును తెలుఁగున నవతరించినవి. గరుత్మంతునకు, 'పెరియతిరు వడి' (=పెద్దవాఁడయిన పూజ్యమయిన పాదములు గల వాఁడు) అని ద్రావిడమున పేరు. దానినే ఆముక్తమాల్యదా కారుఁడు 'పెద్దిరువడి' (4-10) అని యనుసరించినాఁడు.

ఇవియేకావు *తిరువిశక్కోలలు* (=శ్రీ, వెలుగు, కంబ ములు) (4-35); *మొరము* (=చేట), *సావి* (=శాశముచెవి) వని (ఆఁకలి 6-7) ; *సాపడి* (=సాపాటుచేసి, భుజించి 2-23); *తప్పిదారి* (=తప్పితవిరి - ఒకవేళ అని భావము. తప్పి అను ధాతువు ద్రావిడమున 'తవిరి' అని కలదు. ఆంధ్ర ద్రవిడ ధాతువుల ఆమ్రేడితమున నిట్టి రూపమును (దాల్చినవి; 2-27); *పణ్యారము* (=భక్ష్యార్థమున ద్రావిడ భాషలో నెక్కుడు వాడుక—1-73); ఒడమె (=ధనముల); ఎరియు (=మండు, 4-28) మున్నగు ద్రావిడ పదములు నిందుగలవు. ఇట్లే ఊరుంగాయలు, (1-82); పొలయుం గాడ్పులు (1-73); ఇరుమైలం (6-24); ఎన్నినుగూర్తు (1-14); మీన్ మ్రింగిన (6-64); అనుటలోను ద్రావిడ భాషాతత్వము గోచరించుచున్నది. భాషా విషయముననే కాక సంప్రదాయమునఁగూడ నిందు కొంత ద్రావిడ తత్వము కాననగుచున్నది. 'తొశాంబుకంబులు తడియొత్తులును' గొని పోయి, 'ద్రావిడామ్నాయమై స్నాన మాచరించి' నది గోదా

---

24. లలాటే కేశవం విద్యాత్, నారాయణ మథోదరే, మాధవం హృది విన్న్యస్య గోవిన్దం కణ్ఠకూపకే।
ఉదరే దక్షిణే పార్శ్వే విష్ణుం విన్యాద్ద్విజ స్తథా, తత్పార్శ్వే బాహుమధ్యేతు స్మరేత్తు మధుసూదనమ్।
త్రివిక్రమం కణ్ఠదేశే వామే కుక్షౌతు వామనమ్, శ్రీధరం బాహుకేవామే హృషీకేశంతు కణ్ఠకే।
పృష్ఠేతు పద్మనాభంచ కకుద్దామోదరం స్మరేత్, ద్వాదశైతాని నామాని వాసుదేవేతి మూర్ధని।
పూజా కాలేచ హోమేచ సాయం ప్రాతస్సమాహితః, నామాన్యుచ్చార్య విధినాధారయే దూర్ధ్వపుండ్రకమ్"
(మా. వేదంవారి వ్యాఖ్య).

దేవి. (ధౌతాంశుకంబులు : విన్న ఆఱవైచినవి. ఇది ద్రావిడాచారము. ఆంధ్రులకు నేఁటివేగాని పనికిరావు. చూ. వేదంవారి వ్యాఖ్య. పుట. 573). ఇంతేకాదు 'పీల వృషకకు ద్రేఖ *నెఱమకొక్కింత యొరగ* విడివ ధమ్మిల్ల వలయంబు నడుగునందు' గోదాదేవి స్వామి కర్పించు మాలను సవరించు కొనెడిదను సందర్భమున 'నెఱమ కొక్కింత' యనుట ద్రావిడాచారమును వెల్లడించుటకే (చూ. వేదంవారి వ్యాఖ్య. పుట. 539). ఇట్లు గ్రంథమందచ్చటచ్చట వైష్ణవ ప్రభావమును, గొన్ని ద్రావిడ భాషా సంప్రదాయములను సంక్రమించినవి. ఇవియెల్ల మన భాషకుఁ బుష్టినే చేకూర్చిన వనవచ్చును.

ఈకారణముననే రాయల యుగమున వెలసిన ప్రబంధములలో నాముక్తమాల్యద విశిష్టమైన దనుట వైష్ణవాంధ్ర సాహిత్యమున నేతద్గ్రంథమునకుఁగల ప్రాముఖ్య మపూర్వమైనది. తత్కర్త ధన్యాత్ముఁడు.

---

ప్రధానముగ సంప్రదించిన గ్రంథములు :

1. కీ. శే. వేదంవారి వ్యాఖ్యతో గూడిన 'ఆముక్తమాల్యద'.
2. గురు పరంపరా ప్రభావము.
3. శ్రీభాష్యమ్.
4. సూరన 'విష్ణుపురాణము'.

# కొడవలి : కోమలి | రమణశ్రీ

కోతలు మొదలు పెట్టారు! ఎక్కడ చూచినా కోతలే! వరికోతలు! కోమలమ్మ కోర్కెలు పండించి, పనలు పనలుగా పడేసి, ఇన్ని డబ్బులు పడేసుకొనే పనిచేతలు...ఒక్కసారి బతుకులో మళుపు త్రిప్పే రోజులు!

'దొరగారి నిమ్మకాలవ సేలో అక్కుళ్లు కోత్తన్నారు. ఊఁ కోత కొడవళ్లు చిద్దం సేసుకోండి!' అన్నాడు మేస్త్రి నాగప్ప. గూడెమంతా గునగున లాడుతూ సవరించుకొంటోంది.

'తనమాట కేవిఁ? పెనిమిటి రాయడి మాట?' అనుకొంది కోమలమ్మ. 'సెపితే యినుకొనేవోడా? ఏమన్నానా? ఆడిమాట ఆడిదే! ఆ ఫేకటేరీనే పట్టుకు దేవుళ్లాడుతుంటాడు...ఏయేటి కాయేడే, సీజనొచ్చేతలికి, కాళ్ళా యేళ్ళాపడి...ఎందుకొచ్చిన నౌకిరీ? సొతంత్రం లేనిబతుకు?'

ఊళ్లోకెళ్ళి అమ్మేసుకొచ్చిన పిడకలగంప నెత్తి నెత్తుకొని, బంగారమ్మ గుడితలుపులు తెరవడం చూసుకొని, తల్లికి మొక్కింది. ఎవరో కొలుపులు తీరుస్తున్నారు. అతల్లి కడుపు చల్లగా తన బతుకు.... సాగుతుంది. తల్లి దయతో, నాగా లేకండా కోతల కెళ్ళి పనులుదొరికి కూలీలు రోజుకోమెట్టుగా పెకెక్కుతుంటే, ఇంకేం కావాలి?

బంగారు తల్లికి కనువు పండుగునాడు కోరిక తీరా కోడిపిల్ల నిచ్చుకొంటుంది. కొలుచుకుంటుంది. రాయడితో మనువు రాయిలా కదలకండా పడుంటే, ఈ రోజు లిలా చల్లగా జరిగిపోతుంటే, ఇంకేం కావాలి?

తన కడుపు నో కాయకాస్తే...ఇన్ని నగలు తన కాళ్ళనీ, చెవుల్నీ, ముక్కుల్నీ అంటిపెట్టుకు మెరుస్తుంటే...ఇంకేం కావాలి? ఇవన్నీ గొంతెమ్మ కోరిక లేం కావు!

గుడిలో కోడిపిల్లల మెడలు గిజగిజ తన్నుకు దేవురిస్తున్నై. పాపం! అనుకొంది. తన మన సలాంటిది. తిన్నగా నడచి వేపచెట్టు నీడలో నిల బడింది. వాతావరణంలో వేడి శరీరంలో మాలి న్యాల్ని కరిగిస్తోంది. మొహం నిండా కమ్మిన చెమటలో నల్లగలువల్లాంటి కళ్ళు...ఱెప్పలకింద ఱెపఱెపలాడుతున్నై.

రక్తం చిమ్మి నరాలు బిగిసిన కోడిపిల్లలు బంగారుతల్లివడిలో నిదుర పోతున్నై.

తన కొడవలి ... పదును చెడని ... కక్కులు రాలని తన కొడవలికి ఎన్ని జీవాలైనా కరకర తెగి పడతయ్! నిరుడు తయారుచేయించి జాగ్రత్తగా చూరులో దాచిన, బంగారంలాంటి వెండి రేకులాంటి తళతళలాడే కొడవలి!

మళ్ళీ నడక సాగించింది.

ఎదురుగా పావుఁ లొస్తున్నాడు. రయిలు గేటు దగ్గర తారసపడ్డారు.

'ఏరా! పావులయ్యా! కూలు ఎలాగున్నయ్?' అంది.

'ఏం కూలులు?'

'కోతకూలులు'.

'నాకేటి తెలుస్తది?......కోత కెల్తానా? పడుస్తానా? ఎంతసేపూ ఫేకటేరీలో బస్తాల లోడింగు తప్పు......'

'ఐతే బావయ్యా సంగతేటన్నా తెలుసా?'

'ఏవోఁ దొర నెదిరికించి, మాటాడితే తమాసా అనుకొన్నావా?' రాయడి సంగతి తలచుకొనే

సరికి మరి మాటాడలేకపోయింది. పల్లెత్తుమాట పడే వాడు కాదు. దొర తిడితే, చెయ్యి వేసుకోబోతే, ఎదిరించకుండా ఊరుకోగలడా?

పావుఁలు గేటుదాటి, రైలుకట్ట వెంటబడి పోతున్నాడు, వాతావరణం కుబుసం విడిచినట్టు విడిచి, కోమలమ్మ చెఱుకుతోటలో గట్లంట, అరటి తోట వెంపు నడచింది.

రైలుబం డొస్తున్నట్లుంది.

ఆ రెండు ఇనప పట్టాలు దూరాన్నెక్కడో, ఏ లోకంలోనో కలుసుకొనేట్టు కనిపిస్తాయి! ఆ మబ్బులూ, అందని ఆకాశం, ఎక్కడో అరుణవర్ణం స్రవిస్తూ, దూరభూరేఖ రక్తంతో తడసిన కొడవలి అంచులా తళతళలాడుతూ నింగి పెదవి అంచులు ఎఱ్ఱని నురువు ఉరలుతూ...తన కళ్ళ నెంత దూర మైన లాక్కెడుతున్నై!

ఎఱ్ఱకంకర గతుకుల దారి కెటుచూసినా, బరువుగా వంగిన పంటపొలాలు! తన కొడవలి పదునుకి, చకచక తెగిపడి తనకింత తెచ్చిపెడుతయ్!

ఆ డబ్బుల మీదెన్నో పేర్చుకొన్న అసలు! కళ్ళ ముందు గజ్జెకడుతోన్న ముందు బతుకు! రాయడూ పనిలోకి పోయాడంటే నాలుగు చేతుఁలూ ఆడి నట్టె!

దూరంగా మామిడితోపులోంచి పొద్దు వాటారు తోంది, అరటిచెట్ల మధ్యనుంచి, 'చెంద్రి' బయట పడింది ఇన్ని ఆకులు కట్టగట్టుకొని.....

'సెంద్రీ!' అని పిలిచింది కోమలమ్మ.

చెంద్రి చేతిలో మొండికత్తి మొన వెండి మలామా చేసినట్టుంది. స్ఫోటకం పోసిన, ఎఱ్ఱని ముఖంలో అక్కడక్కడ గుంటల్లో నిలిచిన చెమట బిందువులు చెంపల మీదనించి జారుతున్నాయి. జీబురుపొదలాంటి తలలో కత్తిపిడితో గోక్కుంటూ, 'ఉండు తల్లా! ఇయ్యాల గెంజినేదు. ఈ ఆకు లమ్ముకుతేవాల! ఇప్పటికే, పొద్దు గుంకిపోతా వుంది! నీ కేం? నన్ను పోనీ...'

కోమలమ్మ మాటాడలేదు. చెంద్రి ఊరి వెంపు దారితీసింది. చెవులకి ఇత్తడి పోగులు, రెండు బుగ్గలకీ, గెడ్డంకిందా పచ్చబొట్టు చుక్కలూ... మెడలో తెగిపోయిన పసుపుతాడు, జారిపోయిన నల్లపూసలు, అదీ దాని బతుకు!

ఎండ చల్లబడింది!

త్వరలో గూడెంలో గుడిసెచేరుకొని, చూరులో కొడవలి అందుకోవాలి! ఎఱ్ఱని గుడ్డపీలిక చుట్టిన కొడవలి!...ఆకురాయితో కక్కులు రాయించి, పదునుపెట్టించి ఎఱ్ఱదామరలాంటి అరచేతిలో నెల వంకలా కొడవలి తళ తళ మెరుస్తుంటే, తన అందాలు రాయడికి నూరిపోస్తుంటే తనబతుక్కి కేం కావాలి?

రాయడితో మనువు రాజుతో మనువన్నారు గూడెంవాళ్ళంతా! వాడి మనసులో ఏదిరాజు?

కళ్ళలో చూపులతో రక్తం చిందుతూ తన వయసు కరిగించుకుత్రాగే మగడు! ఫ్యాక్టరీలో యింజన్లతో కణకణలాడే నిప్పుతో గిరగిర తిరిగే చక్రాలతో ఎప్పుడూ ఆటలాడుతూ తన్ని కాదన్న మాదన్నలమీద పగబడుతూ, 'రకతానికి, రకతం.. దెబ్బకి దెబ్బ...'అంటూ పగలబడే రాయడు!

రాయడంటే గూడెంలో చిరుతపులి! వాడిపేరు చెబితే పిట్టలు నీళ్ళు తాగవు!

రైలు రైయ్యుమని, చప్పుడు చేసుకొంటూ, భూదేవత గుండె లదరగొడుతూ పరుగెత్తుతోంది రైలు. ఆ శబ్దప్రళయాన్ని గుండెలు అనుకరించాయి. ఇంజనులో మండుతోన్న అఖండమైన అగ్ని...అదెప్పుడేనా తనకళ్ళబడితే, కనుచూపు మేరవరకూ అనుకరిస్తూ వుంటుంది!....

పాక చేరుకొనేసరికి, గొల్లభాగవతుల కుర్రాడెవరో పాకల దగ్గర తను సొంతంగా కవిగట్టిన పాటపాడుకొంటున్నాడు కంజిరా ప్రయోగించుతూ లయగా ఆడుతూ....

పొద్దు బాగామళ్ళింది. పాకలదగ్గర కోడిపిల్లలు, మేకపిల్లలు పాట చెవులురిక్కించి వింటున్నాయి.

అహాఁ మే స్తిరిగోరూ!
ఒహో మే స్తిరిగోరూ!
కోతలకి మోతలకి
కూలీలెలాగ?....
ముతకోళ్ళకి ముసిలోళ్ళకి
మూడేసణాలు!
ఆకతాయి కుర్రోళ్ళకి
ఆరేసణాలు!
పడుసోళ్ళకి పనోళ్ళకి
పదేసణాలు!

అవతల కేతులో జనం గుమిగూడి కేకలేసు కొంటున్నారు. రోజూ ఉన్నదే పాడుగొడవ! మరింత పశువుల్లా మారి, బుర్రలు బద్దలుగొట్టుకోడానిక్కూడా జంకరు!

మొదటి మొగుణ్ణొదిలేసొచ్చిన తాయారు, మరో మనువుని చుట్టబెట్టుకొంది. రెండో మనువు వందరూపాయలు ఓలి ఇచ్చి, మొదటి మనువుని వదుల్చుకోవాలి!

పెళ్ళామూపోయి, ఓలీపోయి మొదటి మొగుడి గోల! రోజూవచ్చి తగువు!

'సద్దుబాటు నూసుకు నిత్తాలేరా!' అని రెండోవాడు వాయిదాలపై వాయిదాలు!

'డబ్బిచ్చి తీసుకెల్లు! అందాకా నాకడనే ఉణ్ణియ్యి తాయార్ని నేనే బరాయిస్తాను' అని మొదటివాడు గోల!

రామరామ! ఇంత అవివేకం, అజ్ఞానం! ఇంత వస్తువులమార్పిడిలాంటి స్త్రీ జీవితం...

కోమలమ్మ ఎంత తక్కువయినా, స్త్రీగా తన విలువ తనకి తెలుసు...మనుషులూ, మనవులూ, మనసులూ మధ్య ఆరాటంలో రాపిడి తనకి తెలుసు.

అందుకే గూడెమంతా కోడై, 'అబ్బో! అది పత్తిత్తు! కొలాన తప్ప బుట్టింది.' అని కూస్తుంది!

'కోమలీ! నీమూలానే నేను మణిసిని. లేపోతే ఏనాడో గజదొంగనీ, ఖూనీకోరునీ ఐపోదును' అనేవాడు రాయడు.

'కోమలంటే కోమలే! దాంతో ఎవడాగ్గలడు? నిప్పు' ఆమాట ఎవరినోటన్నా వినిపించినపుడు తన వళ్ళు పులకవస్తుంది. రాయడి ప్రాణాలకి, తనకి ముడి!

కొడవలి పైకి తీసింది. అంచు త్రుప్పుపట్టి నల్లగా వుంది. ఏమాత్రం కరకుదనంలేదు! పదునులేదు! కక్కులు రాలిపోయి వున్నయ్!

మొన్న మొన్నటి వరకూ గడ్డికోతలో అరిగిన కొడవలి. ఆ గట్టంట, ఈ గట్టంట తిరిగి ఎండవక వాననక, పశువులకోసం, తన గ్రాసంకోసం.... మోపెడుగడ్డి కోసుకుని, సంతలో అమ్ముకొని సంతజేసుకొనేది.

చకచక నడచుకొంటూ బ్రహ్మం కమ్మరిసాల దగ్గర కొచ్చింది కొడవలి కక్కులు కోయించడానికి!

'అన్నయగారు! కక్కులు కోసిపెట్టరూ? పొద్దుపొడిసేతలికి కోతకెళ్ళి పోవాల' అంది కోమలమ్మ.

కోరగా చూశాడు బ్రహ్మం. కొలిమి భగభగ మండుతోంది, కోతలకి కొత్త కొడవళ్ళు తయారవుతున్నై.

కోమలమ్మ కొడవలి పిడిదగ్గిర పగిలివుంది. ఎగాదిగాచూసి, 'చానా పాతబడిపోయిందే! కొత్తది చేయించుకోరాదూ?' అన్నాడు బ్రహ్మం. మొహం పొగలు గక్కుతోంది కొలిమి వేడికి.

'ఎందుకులే బాబా! అదే అచ్చొచ్చింది. అదుంటేనాగా నేకండా కూలిపని దొరుకుతుంది' అంది.

గిరగిర తిరిగే కొలిమిచక్రం ఆపుజేసి, ఆకురాయి పైకి తీశాడు. కొడవలి మోపుజేసి కక్కులు కోయడానికి!

ఒక్క ఐదునిమిషాలు!

కరకర ఆకురాయి ఆడింది కొడవలి అంచుమీద.

'ఊఁ నీయిష్టం! కావాల్సినంత కోత. పదునెలాంటిదో నూడు. పీకలు, పీకలు తెగేస్తుంది మరి' అన్నాడు చురుగ్గా.

కానేదు' అని ఆగింది. కుండలో ఎసరు పొయ్యిమీద గుద్దుకొంటోంది.

'నా ఒక్కడితోనా, ఎంతమంది కడుపులు గొట్టాడు ?...మే స్తిరిగిరి యెదవకి ! నారకతం ఉడుకెత్తి పోతంది. నాతోమాటు యెంతమందిని పనిలోంచి ఊడిసేశాడో ? పెల్లాం బిడ్డలు అలోమని యేడుస్తున్నారు. ఆడి బతుకెంత ? ఆడి ఆయు వెంత ? ఇంతమంది ఉసురు...ఆడి నెత్తురు కళ్ళ జూస్తాను, గుండెలు తీసిన బంటను కొన్నాడు గావోఁలు ! ఉసురు బెట్టిన జీవాలు ఊరికే సూస్తూ ఊరుకొంటాయా ?'

కోమలి కర్థంకాలేదీ ధోరణి ! రాయణ్ణి పలక రిస్తే కస్సుమంటున్నాడు. తమిద్దరికీ వెనకాముందు దశుత లేదు. ఆలనా, పాలనా లేదు. ఎవరి కెవరూ లేని బతుకులు ? ఇదే ఓ బిడ్డా పాపా వుంటే, రాయడు తగ్గిపోయి వుండును. మహారాజులతో ఎందుకు లేనిపోని కథలు మనకి ! అదే చెవిలో గూడు కట్టుకు పోరింది. ఎంతకి పెట్టిపుడితే అంతే!

కొడవలి పైకితీసి, గుడ్డపీలిక చుట్టి చూరులో దాచింది. కిరసనాలు దీపం గుటకలు మింగుతోంది. రాయడు నులకమంచం వాల్చుకొని కూలబడ్డాడు. ఎన్ని అగ్నిగోళాలు పెరిల్లున పగులుతున్నయో, తన గుండెలో అర్థం కాలేదు ! 'ఈ అగ్నిజ్వాలలు ఒక్కసారి నీ గుండెల్లోకూడా దేవుకో !' అన్నట్టు చూశాడు కోమలి వెంపు !

పాపం! కోమలి కెంత అన్యాయం చేస్తున్నాడో తను ! దొర బూటుకాలితో పదిమందిలో దెబ్బ తినడమే ? వాడి మాటలో చూపులో తను పశువు. శానిస. తన హక్కుకోసం తను పోరాడాడు. తన పని తన కిమ్మన్నాడు. దొంగరిపోర్టు రాశాడు తనమీద.

వచ్చీరాని తెలుగులో దొర, మీకు ఫరవా లేదురా ! మీ పెళ్లాలు పడుచుకొని, సంపాదించు తారు. పొండి కుక్క వెధవలు' అన్నాడు. నోట పట్టని మాటలు ప్రేలాడు. త్రాగి మత్తెక్కి తన్నాడు. తన ధోరణిలో న్యాయంకోసం పోరాడబోతే...

తన ఆవేశం కట్టలు తెగింది.

తన పరాభవానికి పగవాళ్ళంతా పగలబడి నవ్వారు. అంతకంటె, తన గుండెలో మంట కింకేం కావాలి ? ఈ అగ్ని చల్లారడానికి, వేడి వేడి రక్తం కావాలి !

తనెన్ని ఆలోచించినా, తిన్నగా నెత్రు సుడి గుండంలోనే దుముకుతోంది మెదడు !

జీవుడి ఘడియలు దగ్గరపడి, మృత్యువు జీవిత ద్వారాలు గడియలు తెరచి, తన్ని పిలుస్తోంది. 'నీవే నాకు ఆయుధం కావాలి !' అని—

'మామా ! ఏటి మాటాడవు ? నిన్ను సూస్తంటే దిగులుగా వుంది. ఏం పాలుపోటం నేదు. ఏ మగా యిత్తెం జరుగుతుదో అని బెంగడి సస్తన్నాను.'

రాయడు మాటలేకండా, కళ్ళు మూసుకు తెరుస్తున్నాడు. 'నువ్వు నేకపోతే, నాకు దిక్కేటి? ఇద్దరం కలిసిగట్టుగా ఉంటన్నాం. నువ్వు నేకపోతే నేనూ లేను. నువ్వేటన్నా సెయ్యదలిస్తే ముందు నన్ను సంపేసి పో.'

భోరున యేడుపు పొంగి వచ్చింది. కన్ను రెప్పలతో అపుకొంటూ, 'దొర కొలువే దొడ్డ కొలువు గాదు. పని దొరక్క పోదు. అంతగా నీ కిట్టంనేకపోతే, ఇంటోనే పడుండు. నేను తెచ్చే నాలుగ్గింజలూ ఉడకేసుకు తిందాం. అదీ గాకపోతే, ఇద్దరమూ కలిసే ఎళ్ళొచ్చు. రావొచ్చు. గెంజి నీళ్ళు సాలు. పాలూపరవాన్నంకోసం యెగబడ నక్కర్నేదు.'

కోమలి మాటలకి, రాయడి గుడ్లలో నీరు నిండింది. ప్రేమంటే ఏమిటో కళ్ళలో కరిగింది. ఎప్పుడూ తన్నంటి పెట్టుకుని పెరిగే నీడ.

ఏ వాడు చూడని, ముఖాన క్రమ్మిన నల్లని మేఘం తెరచాటుగా కన్నీరు వర్షిస్తోంది.

కోమలమ్మ ప్రేమగా దగ్గిరికెళ్ళి, 'ఎందుకు దిగు లడతావు ? నీ ముఖం నీకే అసయ్యంగా నేదూ ?

తన్ని నోడికాలు యిరక్కుండా వుంటదా ? పంతా లకు పోయి, మనువూ మనసూ పాడుసేసుకోకు! ఆడిపాణాలు మాత్రం కుదురుగుంటాయా? ఎవడో ఆడి పొగరణిసేస్తాడు. రకతం కళ్ళ సూస్తాడు. మన కెందుకు ? ఆడి పొగురు అణ్ణే కొడతది....'

సంస్కారం లేని రాయడి జుత్తులోకి వేళ్ళు పోనిచ్చి, ఎఱ్ఱదామర లాంటి అరచేత్తో నిమిరింది. రాయడు చంటిపిల్లవాడిలా వలవల యేడ్చాడు గుండెలలో.

పరిపక్వమైన యోచన, కుండలో కూడులా ఉడికింది. చుట్టూ వెలుతురు పొరకప్పుకొన్న గుడిసె. నిశలో ముగ్గి తీతువులాకూస్తోంది!

గుడిసెల పక్క, జామితోటలో చెట్లపై కాపుర మున్న చిలకలు కలలలో ఎఱ్ఱని ముక్కుల్తో కలవ రిస్తున్నయ్!

మేస్తిరి నాగప్ప కూలీ వెయ్యడాని కొచ్చి నట్టున్నాడు. అందరితో చెపుతున్నాడు.

'కోమలమ్మా! నువ్వూ వస్తావా ? పొద్దులే... కూలి పద్దాలు గణాలు... పెద్దొరగారి నిమ్మకాలవ సేలో'.

'ఆఁ' అంది అప్రయత్నంగా.

కొంతసేపటికి పావులొచ్చి రాయడి చెవిలో ఏదో గొణిగాడు.

'మందే తప్పురా.' దొర నెదిరికించటమంటే మాటలంటరా! నిన్నేటో పారిటీమణిసి వన్నాడు. రౌడీ యెదవన్నాడు. ఎన్నో అన్నాడు. నీమీద కన్నేసి ఉంచాడటకూడా. ఆళ్ళ అడుగులికి మడుగు లొత్తాల్సినోళ్ళం. దవుర్జెన్నాని కెగబడితే, ఆళ్ళు దొరలు.... ఏటన్నా సేయిస్తారు. ఆళ్ళేంజేసినా కమ్ముకుపోద్ది. ఎటొచ్చి బయటపడి పోయేవాళ్ళం మనమే! మన మనవినేవాళ్ళుండరు. ఆళ్ళు 'కో' అని పిలిస్తే కోటిమందొచ్చి వాల్తారు. ఏ బలం సూసుకుని మన యిరగబాటు ?'

రాయడు తోక తొక్కిన తాచులా లేచాడు.

'నాకు పిరికిమందులు నూరిపోయడానికంటరా వచ్చావు? ఒఠి పిరికి యెదవలు. బానిస బతుకు బతికితేనేం సస్తేనేం? ఆళ్ళ కాళ్ళకి మడుగు లొత్తాల్సినోళ్ళ మటరా? ఛీ. ఛీ. రేప్పొద్దుట ఇంటల్లిపాదినీ, ఆడి బంగళాకి తారస మంటాడు. తారసండి! అలాంటి యెదవ. ఇంకా బతికున్నాడు. హుఁ. సీరంగ నీతులు సెపుతున్నావుగాని, యెల్లు. నీపెతాపాలు నాదగ్గర కాదు.'

'యెల్తాగాని, కాస్తతమాయించుకో! తొందర పడమోకు. గూడానికి మంచిపేరు దేవాల. వొదిని సెప్పినట్టినుకో!'

బయటికి వెళ్ళాడు పావుఁలు.

కోమలమ్మ! 'పావుఁలయ్యా!' అంటూ వెంట బడింది.

'జరిగిందంతా యిదే వొదినా ? పెద్దోళ్ళతో పంతాలెందుకు ? ఆడేదో ఎఱుపుజండా పారిటీలో సేరాడు. మనకెందుకు పారిటీలు, అవసరమైనంత కాలం పని సేయించుకొని సెరుకు పిప్పిలా వూసి పారేస్తారు. సిన్నోణ్ణో, సితకోణ్ణో అణ్ణి కనిపెట్టుకో! పొద్దులే కూడా కోతలికికూడా తీసుకెళ్ళు! ఒంటిగా ఒదలకు. మనుసు దిగుల్లేకుండా, ఆమాటా, యీమాటా పలకరిస్తూవుండు!' అంటూ చీకట్లో కలిసిపోయాడు.

కోమలమ్మ కొన్ని ఘణాలు ఆలోచిస్తూ నిల బడింది.

ములగచెట్టుమీద గుడ్లగూబ గుఱ్ఱురుమంటూ కూసింది.

చెట్ల చీకట్లో అన్వేషిస్తున్న మిణుగురులు వెలుగుతుంపరుల్లా రుద్రవీణా ప్రకంపనల్లా రేగు తున్నయ్!

ఆకాశంలో ఱెక్కలు విప్పుకొన్న రిక్కలు తళతళ మెరుస్తూన్న కొడవలిలా చంద్రవంక....

తాటిచెట్లమీద గాలిలో ఎగిరే అదృశ్యపు దెయ్యాల ఱెక్కల చప్పుడు.

'సాల్లెండి ! యెటకారం. బాగానే దీయించారు ! పీకలు తెగేసేవోళ్ళు యేరేవున్నారు. మాయింటా వంటా లేదు. అంతకంటె యెదవ బతుకు బతికే కన్న సావుమేలు.' అని, చెంగున ముడేసిన బేడతీసి బ్రహ్మం చేతిలో పడేసింది. కొడవలి పదును చేతికి రాసుకు చూసుకొంది.

సంజె అంచులు ఎఱ్ఱని కంటి జీరలా, పెదవి వంపులా చీకటి కటిలో జారిపోతున్నయ్.

★ ★ ★

'ఏం మామా ! అల్లాగున్నావు ?'

పొయ్యి కంటి జీరలా మంట అంటుకొని భగ భగ రాజుకొంటూంది. పుల్లలు ఎగదోస్తూ, పొయ్యి మరింత మండేలా ఊదుతూ అంది కోమలమ్మ.

రాయడి కళ్ళు ఎఱ్ఱ చింత నిప్పుల్లా వున్నయ్. పగ పొగలా కమ్ముకొని వుంది. ఎంతసేపూ నిట్టూర్పుతో తాచులాంటి బుస......

'ఏంటీ నేదు'

కోమలమ్మకి అంతుచిక్కలేదు. ఆవేశం వచ్చినపుడు రాయడంతే ! నోరు పెగలనీడు. ఎంతసేపూ సుడిగుండం గుండెలోనే తిరుగుతుంది. గొంతులో పొంగదు.

'నాకు చెప్పకూడదా ? ఏటో జరిగింది యిసేసం' అని, రాయడి మండుతూన్న కళ్ళలోకి, శాంతమైన ఆర్ద్రమైన చూపులు నిగిడిస్తూ, చల్లార్పడానికి ప్రయత్నించింది !

తనెంతకైనా ఆడది. ఐనా, తన భవిష్యత్తు కోసమైనా తెలుసుకోవాలి !

'కోమలీ !' అని ఆగాడు రాయడు. దెబ్బతిన్న పాములా రోజాడు. బుస గొట్టాడు.

పదును పెట్టించిన కొడవలి తళతళ చీకటిలో మెరుస్తూ, కరకర చూసింది రాయడి కళ్ళవైపు !

'దొర పనిలోంచి తీసేశాడు. దాంతో సరా ! బూటుకాలితో తన్నాడు యెదవ'

రోషంతో గప్పున మొహం రగిలింది. పళ్ళు పటపటలాడాయి. ఒక్కసారి ఉవ్వెత్తున పొంగింది ఆవేశం.

కోమలమ్మ కొర కొరలాడింది. 'ఆఁ' అంది. పాకమీద కప్పు దడదడలాడింది.

మసక మసక చీకటి క్రమ్ముకొంటోంది. బయటింకా, తాయారమ్మ గొడవ జరుగుతూనే వుంది. వరదలా వస్తోన్న చీకటిలో తమ కొంప మునిగిపోతోంటే. చిన్న తెప్పలా దీపం వెలిగించింది !

రాయడు ఫ్యాక్టరీలో పనిచేస్తున్నాడని తనకెంత గర్వం ? గూడెంలో తనో అంతస్తు పైనున్నట్టు అనుకొనేది. అదే తన అస్తి !......అప్పుడప్పుడు అన్నం కేరేజి పట్టుకెళ్ళి పిప్టులమీదున్నప్పుడు ఇచ్చేది.

ఫ్యాక్టరీనించి, మామ బయటపడ్డాడు. ఒకళ్ళతో మాట పడని, దెబ్బపడని అభిమానం...బూటు కాలితో తల్లడిల్లిపోయింది.

'పొమ్మన్నవో డెలాగూ పొమ్మన్నాడుగందా ? తన్నట మెందు కొచ్చిందట ! నీవు కానిపని సేశావా ? పని పాడుసేశావా ? ఏటి జరిగింది ?'

రాయడి నోరు పెగల్లేదు.

దొరని, తన నౌకరీలో ఎదిరించాడు. చాటుగా తిట్టాడు. అది అర్థమై దొర తన్నాడు. అంతేనా ? ఇది కోమలి దగ్గిరెందు కీరభస !

ఎన్నాళ్ళీ బానిసబతుకు ? ఒకళ్ళ మోచేతికింది నీళ్ళు ? 'నే సెప్పలేదూ? ఎందుకొచ్చిన ఉద్దేగమని... పగలనక రాతిరనక ఆళ్ళెప్పుడు రమ్మంటే, అప్పుడెళ్ళటం.... ఉక్కలొచ్చిన పశులం...సొతంత్రంగా బతకనేవాఁ ? రేప్పొద్దునించి వరికోతలు...చేతినిండాపని....సెరుకుతోటలో పనులు ముమ్మరంగా దొరుకుతయి. తొలకరించే తలికి ఊడుపులు.... సెక్రం తిరిగినట్టు తిరిగిపోద్ది. మిల్లునించి బయటబడ్డందుకే, బంగారు తల్లికి మొక్కుతాను. మనం సెరో కొడవలీ యిచ్చుకొంటే పండగదాకా ధాకా

తెల్లని మబ్బుల చీరచెరగుల రాపిడి.

చీకటిలో తేలుతోన్న తెప్పలవలె గుడిసెలన్నీ ఒకదాన్నొకటి ఒరుసుకొంటూ, కాలప్రవాహంలో ఏదూర తీరాలకో కొట్టుకపోతున్నయ్ !

కంటి తెప్పలకింద బంగారమ్మ గుడి తలుపులు తెరచుకొని, 'తల్లీ ! నా దేవుడిమీన యీగవాలనీకు! కనువు పండుగనాడు కొలుపులు తీరుస్తాను' అని మొక్కింది కోమలమ్మ.

★ ★ ★

ఎక్కడపుట్టి పెరిగిందో, ఈ గూడెంలోకి వచ్చి పడింది. రాయడు ఊళ్ళన్నీ వేటాడి తెచ్చుకొన్నాడు ముసలాడికి అడిగినంత ఓలిచ్చి ! తల్లి తనని కని, వదిలేసి మారు మనువునికి పోయింది. తన తండ్రి కలరా దగిలి చచ్చిపోయాడు. ఇంతకాలం తాత సాకాడు.

జవ్వనం రాగానే, రాయడి కౌగిట్లో చిక్కింది ! 'కోమలమ్మ లాంటి పిల్ల లేదురా !' అనిపించుకొంది. ఎంతమంది తనకోసం ఎగబడినా కాల దన్నింది. ఒకటే మూర్తి...తన హృదయంలో నిండిన రాయడు.

తనమీద పగబట్టి, పసిగట్టినవారి చూపులదాడి నుంచి దాచేస్తూ, 'అన్నయ్యా ! అన్నయ్యా !' అని చక్కగా దువ్వి బూజుపట్టిన మనసుల్ని దులిపి నవ్వుకుంటూ ముందుకు సాగిపోయేది !

తొలిరోజుల్లో రాయడు ఏ పనికి వెళ్ళనిచ్చేవాడు కాడు. కాని రోజులు గడపక తనూభుజం కలిపింది. పనీపాటల్లో తనూ ఇంత సంపాదిస్తోంది.

రాత్రిరాత్రంతా, సింహం నిదురించే గుహలాంటి ఒడిలో నిద్రపోయింది కోమలి ! నిద్ర విదళించి పారేసిన రాయడు .... కళ్ళు చీకట్లో రెండు జ్యోతుల్లా వెలుగుతూ, పీడకలలు వెలిగిస్తున్నయ్ !

అదేదారి ! గుహలో విడిసిన పెద్దపులి ! గుడిసె అదిరిపోయేలా గాండ్రిస్తోంది.

జీబురు పొదలాంటి తలకెలుక్కున్నాడు. కోమలి తల ఒడిలోంచి మంచంమీద దింపాడు. పెదవుల్ని తన పొదవులతో తేలిగ్గా కదిపాడు. అమాయికంగా నిద్రపోతోన్న లేడిపిల్ల. సాహసాలు, పగలూ, ద్వేషాలూ, ఆవేశాలూ ఎరుగని, కనురెప్పలకింద కన్నీళ్ళతో గుండెల్ని అభిషేకించే అమాయకురాలు! తనంటె, తన మనువంటె ప్రాణంకోసి నివేదించే ఇల్లాలు తప్పదారిని తన దగ్గర కొచ్చింది !

ఎన్ని నీతులు చెప్పింది? ఎన్ని కలలు కనిపించింది? ఎంత మెత్తని మాటలతో, గుండె కరిగించాలని వాపోయింది?....అవన్నీ అగ్నిగుండంలో చిటపట పేలిపోయిన అశ్రుబిందువులు !

తెల్లవార వస్తోంది !

రాయడు లేచాడు. చూరులో ఎలకలు త్రుళ్ళి పడి అటూ ఇటూ పరుగెత్తాయి !

★ ★ ★

గుడిసెలో పై కప్పు తాటియాకులమీద అర్థం కాని కవిత్వం, ప్రత్యూష పవనాంకురాలకి రేగుతోంది. తెల్లవార వస్తోందేమొ !

అరవిరిసిన కోమలి కన్నులలో మొలిచిన కల...

...కోమలి...బంగారుతల్లి గుడి...ముందు...

తన కొడవలి, రాయడి చేతిలో రక్తంతో తడిసిన జెండామీద తెల్లని కొడవలి ముద్ర...

రాయడి దంతాలపై కొడవలి అంచులా తెల్లని నవ్వు...వరి కోతకు నాగప్ప ఈడ్చుకెడుతున్నాడు. తన చేతిలో కొడవ లేది ?......

అంతా కలకలం. తనపక్క రాయడేడి ?

పరుగెత్తుకొస్తున్నాడు అల్లంతదూరాన. వగురుస్తూ... పొగులుతూ... ఎఱ్ఱని రక్తం చిమ్ముతూన్న కొడవలి... తన కోత కందివ్వడానికి...

వంటిమీద బట్ట గాలి కెగిరిపోతున్నానరే !... నాగప్ప... పావులు... చంద్రి... చోద్యంగా నవ్వుతూ విరగబడి చూస్తున్నారు...

ఏమిటీ పీడకల ?

గూడెంలో తెల్లవారిన సందడి....

స్ప్రింగులా లేచింది పక్కమీంచి...కోమలమ్మ. పీడకలని కళ్ళలో నులిమేసింది ! పక్కన రాయడు లేడు ? ! అతని ఒడిలో బాగా నిద్రట్టేసింది ? !

పావులు హెచ్చరికలు... 'జాగర్త! ఓకంట కనిపెట్టుకో! 'చెవుల్లో మార్మోగుతున్నాయి...

లేచింది గుడిసె అంతా కలయదిరిగింది. బయటి కొచ్చి చూసింది. ఆకాశంలో ఎఱ్ఱదనం పేరు కొంటోంది!

మళ్ళీ లోపలికొచ్చి పడింది. చూరులో వెదికింది. ఏదీ కొడవలి?

గుడ్డి వెలుతురులో ఇల్లంతా వెదికింది.

కళ్ళల్లో ముంగురుల్లా చెదురుతున్న కలలు...

వంటిమీద విద్యుత్తు ప్రవహిస్తున్నట్టు...

నరాలు మత్తు దులుపుకొంటున్నయి. కక్కులు కోయించి బాగా పదును పెట్టించిన కొడవలి!

ఏమైందో? తలుచుకోడానికే భయంగావుంది,

ఈ గూడెమే ఇంత! ఏమైనా వచ్చేసరికి కొడవళ్ళూ, కత్తులూ, కర్రలూ చేతికెత్తుకొని నెత్తి బద్దలుకొట్టుకొంటారు! రాతియుగం మనుషులు!

రాయడు తన్ను పలకరించన్నాలేదు!

కొడవలితో అతని కేం పని?

అమ్మో! తలచుకోడానికే భయం వేస్తుంది! తన మూలంగానే ఇదంతా! లేనిపోని యాతన పడి పదును పెట్టించింది. తనొకందుకు చేస్తే, మరొహాకై పోయేట్టుంది.

రాయడు అనుకున్నంతపనీ చేసి తీరుతాడు!

ఉద్వేగం...ఉద్రేకం...ఆవేశం .. అన్నీ గుమిగూడి రాయణ్ణి రాక్షసుణ్ణి చేశాయి. అర్థంకాని మనస్సు... అదే తన పసుపు తాడు పుటిక్కిన తెంపే ఆయుధం!

బాగా తెల్లవారిపోయింది.

రాయడి గురించి, మనసు తపిస్తోంది. తన్ని తాను శపించుకొంటోంది.

'కోతకు బయల్దేరు' అంది చంద్రి గొంతు,

'కొడవళ్ళేదు' అంది కోమలమ్మ.

అంతా బిలబిలలాడుతూ కోతలకి పోతున్నారు పలపాటల్లో తేలిపోతూ.

'ఊళ్లో బజారు కెళ్ళి కొనుక్కోపో' అని చంద్రి కూడా అందరిలో కలిసిపోయింది.

తనకి చెప్పకుండా కోత కెళ్ళాడేమో?

వరిమాట!...గొంతుకోతకి!...ప్రాణాలమీదికి తెచ్చుకోడానికి!...ఫ్యాక్టరీ ఇక్కడికి మైలున్నర దూరం...

దారిలో పొదలూ, అడవిలాంటి తోటలూ, రైలుపట్టా దాటి ఊరి చివర కష్టదారిని పోతే అక్కడే పొగగొట్టం ఘూంకారిస్తూ వుంటుంది!

దిక్కుతోచని దిగులు.....వచ్చిపోయేవాళ్ళని చూస్తూ నిలబడింది పాక ముందు.

'కోత కెళ్ళనేదేలే? కోమలమ్మా!' అని పలకరిస్తున్నారు.

రాయడి సంగతడగరేం? ఏమి జరిగిందో తెలుసుకోరేం? తలుపు రెక్కలు దగ్గరికి నొక్కింది.

తలపు రెక్కలు తిప్పుకొని, ముందుకు పరిగెత్తింది.

బంగారుతల్లి గుడి...

కలలో తల్లికూడా కనబడింది. మంచుతెరలు కప్పుకొని, ప్రకృతినిశ్వాసంలో నిట్టూర్చిన చప్పుడు వినిపిస్తోంది.

కోతలు పాడుచేయడానికి సన్నగా తుంపర... చినుకులు తన గుండెలో మినుకుమినుకుమంటూన్న దీపం...

తల్లికి కన్నీళ్ళతో మొక్కింది!...కళ్ళని జీరుకు పోతోన్న కొడవలి!...గబగబ ముందుకు నడచింది. గత రాత్రి - కళ్ళముందు గరిడీలు తిప్పుతోంది!

జనం రోడ్ల మీద పలచ పలచగా తిరుగుతున్నారు. తన వెంపే అందరూ పరిశీలనగా చూస్తున్నట్టుంది. తన కళ్ళు, తనువూ, మనువూ వెదుక్కుంటోన్నవి, దేనినో? దేనికోసమో?

పొదలూ, తోటలూ...అన్నింటినీ దాటుకొని...

కాలవ వంతెనమీద కొచ్చింది. చినుకులు ధార కట్టాయి. కాలవలో ప్రవాహం తన్ని చూసి కదిలినట్టుంది!

పూర్తిగా తడిసిపోయింది! ఐనా, సరే తన లక్ష్యం చేరాలి!

ఎవరేం చెప్పుకొంటూన్నా ఎందుకో తన చెవులు రిక్కించి వింటున్నయ్! ఎందుకో చెప్పలేని ఆందోళన!

ఫ్యాక్టరీ దరిదాపుల కొచ్చింది.

'పాపం'...దొర గిలగిల తన్నుకుపోయాట్ట! మెడమీద వేటు....కొడవలితోనే....కోత కొడవలిట?...మాంఛి పదునుమీదుందట!'

'ఎవడి పనో?'

'ఏమో ఎవడో? ఎవడి ఉసురు పోసుకొన్నాడో? తెల్లారగట్ల షికారు కెళ్ళాట్ట దొర. చాటుగాపొంచి, పెద్దపులిలా మీదపడ్డాట్ట. అంతే! కొడవలితోనో, దేనితోనో నాకేశాట్ట! రక్తం పొంగి పొరలిందిట దొర వంటిమీద....కొన వూపిరి ఉండగా హాస్పిటల్ కి తీసుకెళ్లారు'

'కేక వెయ్యలేదూ?'

'కేకవేశాడు. వచ్చీలోపునే పారిపోయాడు హంతకుడు' కోమలమ్మ కన్నీళ్ళతో తడిసిపోయింది. 'కొడవలే! నా కొడవలే! ఎంతపనిచేశావు మామా?' గుండెల్లో రాయిపడింది. వర్షం తగ్గలేదు. ఎక్కడికి పారిపోయాడో ఏమో?

దొరబతుకు రక్తపు మడుగు...ఈ తుపాను కన్నీటితో ఆ మడుగు బురదయి పోయినట్టుంది.' అనుకొంది.

'దొరని, తనెన్నోసార్లు చూసింది రాయడి కన్నం తీసుకెళ్ళేటప్పుడు. అంతెత్తు విగ్రహం... కందగడ్డలాంటి శరీరం.

గిరుక్కున తిరిగింది గుడిసెవెంపు.

అప్పుడె బయట పొక్కింది. అట్టుడికినట్టుడుకుతోంది ఈ వార్త.

దొర స్టేటుమెంటులో పేరుకూడా చెప్పాడట. దేశం కాని దేశంలో తెలుగు మట్టిమీద ప్రాణాలు ఆరిపోయాయి రక్తపు చారలలో.

అందరి నోళ్ళలో తను శపింప బడుతోంది!

కాలవ వంతెనమీద కొచ్చేసింది! ప్రవాహం... వంతెనమీదినించి చూసింది. ఒడ్డుకొరిగిన ప్రవాహంలో మహావేగంలో తళతళ మెరుస్తూ....గట్టు వెంట కిందికి దిగింది.

పైకి తీసింది. కొడవలి! అదే కొడవలి!....పిడి దగ్గర పగులు...రక్తం బలిగోరింది!

'పీకలు పీకలు తెగేస్తుంది. మాంఛి పదునుపట్టు కెల్లు' కంసాలి బ్రహ్మయ్య గొంతు, వెటకారిస్తోంది!

'అబ్బే! అలాంటియి మా యింటావంటాలేవు?' ఇప్పుడేమంటావు?

ఎఱ్ఱ రక్తపు మరక పిడిపగులులో జారింది. ఒడ్డుని తాకుతోన్న తరంగతురంగాలు, అలసిసొలసి నురగలు గక్కుతున్నయి.

ఇక్కడ విసిరిపోయినట్టున్నాడు. ఎక్కడికి పారిపోయాడు. తన మొహం, ఏ మొహం పెట్టుకొని చూడ్డానికొస్తాడు? ఇక రాయడు రాడు. తనది ఒంటరి బతుకు?

కొడవలి అంచు, నీలికోక పచ్చని అంచుతో తడితుడిచింది. వేడిరక్తం చవిగొన్న కక్కులు... అగ్నికీలలు కక్కుతున్నయి. హింసను రుచిచూచిన అంచు మొద్దుబారింది!

త్వరత్వరలో గుడిసెవెంపు నడచింది.

గూడెమంతా కోడై కూస్తోంది. రాయడు చేసిన ఖూనీ గురించి. కోమలిని కోరగా చూసింది గూడెం. వెలివేసినట్టు వెలితిగా చూసింది.

వానరాకడ. ప్రాణంపోకడ. అన్నట్టున్నయ్ వరికోతలు. కోతలకెళ్ళిన వాళ్ళంతా తిరిగి వచ్చేస్తున్నారు. ఎంతమంది ఎన్ని పలకరించినా కోమలమ్మ కన్నీళ్ళే సమాధాన మిస్తున్నయి.

సాయంకాలానికి రాయడు తనంతతాను పోలీసులకి దొరకిపోయాడని వార్త.

కోమలిలో చైతన్యం జ్వలించింది.

ఏదో పూర్వవాసన గుప్పుమన్నది గుండెలో.

కోరికల్నీ, కోమలమైన శరీరాన్ని, కోకనీ గుడ్డిదీపంలో ముకుళించిన వెలుగురేకల్ని జ్వాలలుగా, సజీవచితిగా మాయమైపోయింది కోమలమ్మ.

బంగారుతల్లి గుడి తలుపులు తెరచుకొన్నయి. తల్లిలో కోమలమైన వెలుగు కళికరేకులు విరిసింది.

'కోమలీ! గూడానికి పేరంటాలువికా!' అని దీవించింది తల్లి.

# సంధ్యారాగిణి | వేముగంటి నరసింహాచార్యులు

భారతీయాంగనా ఫాలభాగమునందు
        బొలుపారు కుంకుమబొట్టువోలె
పొలయల్క వేళ పూబోడి కన్నులలోన
        రేకెత్తు కావిరిరేకవోలె
ముదురుటాకుల జొంపములనుండి కన్పించు
        క్రొత్తదాసాని పూగుత్తివోలె
కలికి బంగారు బిందెలనిండ బోసిన
        ద్రాక్షారసపు పొంగు రంగువోలె
వసుధయెల్ల వసంతోత్సవప్రమోద
లీలలన్ దేలియాడెడు లీలనొప్ప
స్ఫుటతరంబుగ దశదిశాతటములందు
తొలకరించె సంధ్యారాగవిలసనంబు.

నవలావణ్యవిలాసినీ! రుచిర సంధ్యారాగిణీ! చూడ్కి పం
డువుగాగన్ రతనాలతేరుపయినన్ గూర్చుండి, యాకాశ వీ
థి విహారం బొనరించుచున్ మిగుల నుద్దీపించు నీభాగ్య వై
భవ సంపత్తునకున్ మదీయ మృదుభావస్వర్ణపూజాంజలుల్.

ఇంపుగుల్కగ నీలి మొయిళ్ళ నీడ
కట్టుకొన్నావు పుష్యరాగముల మేడ
నాటుకొన్న నీ కుంకుమ తోటలోన
నొలయు తెలిమొగ్గలట్టు లొక్కొక్క చుక్క.

నీ వొక స్నేహదీపికవు ; నీ చిరువెచ్చని కౌగిలింతలో
భూవలయమ్ము దైనికవపుశ్శ్రమ దీరగ హాయి నొందెడిన్
నీ వొక ముద్దరాలి రమణీయ సుధామధురాధరమ్ముపై
జీవుల మోహపెట్టెదవు చిత్రము ! సాంధ్యకళావికాసినీ !

చిరునవ్వు పులకించు విరికన్నె మోవిపై
మధుర తాంబూల చుంబనమొనర్చి,
నిలయోన్ముఖమ్మైన పులుగు రెక్కల మీద
మొలకలత్తుక వన్నె ముద్రవేసి,
కలయిక కుదురని వెలుగు చీకటుల మ
ధ్య వినూత్న రాగ బంధమ్ము గూర్చి,
సరసీ తరంగాళి పురిటింట నురుగు పా
పలకు కెంబట్టు పొత్తిళు లమర్చి,
అద్రి శిఖరాల పాద చిహ్నములు మలచి
కుజ శిరస్సుల సిందూర రజము చిలికి
ప్రకృతి సౌందర్య లక్ష్మికి మకుటము నిడి
అలరుచుందు వందముగ సంధ్యా శుభాంగి !

పగలింటి తాప మార్చుకొ
నగ మిన్నులు ప్రాకి, వనమునన్ దూకియు చ
ల్లగ, మెల్లగ గాడ్పులు నీ
దృగంచల స్పర్శ పులకరించి చరించున్.

కారుమేఘాల చీకటి కానలందు
మరుగుపడుచుందు వొక్కొక్కమాటు నీవు
"ఘనులు" గా పేర్గనినవారి కపటములకు
కలతనొందెదు నిను జూచి కళవళింతు.

అమలరాగ గుణ స్నిగ్ధవైన నీవు
యామినీ కామినీ ప్రియుండైన తిమిర
దానవుని క్రూర బాహుబంధముల జిక్క
నవసిపోవుట గని గుండె లవిసిపోవు.

# అభిజ్ఞాన శాకుంతలము | విశ్వనాథ సత్యనారాయణ
4

ఈ రీతిగా కావ్యాదియంతయు భావి సర్వకథా సూచనయు, నదియైనంతనే దుష్యంతుని పుత్రవాంఛా సమనుగత తద్యోగ్యక్షేత్రాన్వేషణా నిబిరీసమతి లక్షణముగా సంయోజింపబడిన యీ ప్రథమాంకము శకుంతలాదర్శనము పరస్పరనివిష్టచిత్తత్వమునుంగా సమకూర్పబడినవి. యథార్థమునకు కథయంతయు నైపోయినది. తక్కిన యంకములయం దీకథ పరచబడుటతప్ప మిగిలినదేమియులేదు. కథ తావన్మాత్రమే యైనచో నీ కథను ప్రపంచించి తత్తత్కాలసమాపతిత వర్ణనా చమత్కారానుసంధాయిగా తక్కిన యంకములను పూరించుట కాళిదాసుదాక నక్కఱలేదు. వర్ణనా విపుణులైన కవులకు లోకమునందు కొరత లేదు.

మరియు వట్టి చిత్తవృత్తులచేతనే గాక వాచ్యతకు మిక్కిలి సన్నిహితముగానున్న వ్యంగ్యముచేత గూడ శకుంతల దుష్యంతున కర్పింపబడినది. ప్రియంవద మీది కోపముతో నామె యనిన మాటలు గౌతమికి చెప్పుటకు తాను పోవుచున్నానని శకుంతల బయలుదేరినపుడు ప్రియంవద 'వృక్షసేచనే ద్వే మే ధారయసి తస్మా దేహి తావ దాత్మానం మోచయిత్వా తతో గమిష్యసి'. నాకు రెండు కుండల నీళ్ళు అప్పుపడి యున్నావు. అప్పుతీర్చి మరియు కదలుము అన్నది. అపుడు రాజు అంగుళీయక మిచ్చెను. ప్రియంవద 'మోచితా స్యనుకంపినార్యేణ' దయగల యీయన చేత వదలింపబడినావు — ఒకటి అప్పునుండి, వ్యంగ్యము కన్నెచెఱనుండి, మరియు కణ్వునినుండి.

ఈరీతిగా పర్వమునిబద్ధమైనది. నాటకము పూర్తియైపోయినది. ఇంకనేమి మిగిలినది ? అంకము పూర్తికావచ్చినది. తృతీయాంకము చివర ఏ సంఘటనము జరిగినదో - అనగా,

గాంధర్వేణ వివాహేన....

...అధరస్య పిపాసతా మయా తే

సదయం సుందరి గృహ్యతే రసోఽస్య

—ఇత్యాది ఈ ప్రథమాంకాంతమందే జరుగ వలయును. అపుడు రెండుమూ డంకములు వ్యర్థము. అయిదారంకము లనవసరము. ఏడంకములలో నాల్గంకములు తీసివేసినచో శాకుంతలము మూడంకముల నాటకమగును. అపుడు నాటకమే లేదు. మరి యేమి కావలయును ? ఈయంక మెట్లు పూర్తిగావలయును ? తృతీయాంకము చివరనున్న సంయోగము ఈ యంకముచివర నెందు కుండగూడదు ? ఉన్నచో కథయే లేదు. ఒక రాజొక తాపసికన్యకను చూచెను. వారు పెండ్లియాడిరి. ఒక కుమారుడు కలిగెను. ఇది కథకానేరదు. ఇక యొక వార్త.

అందుచేత ఈ యంకము నిచ్చట నాపివేసి కథను పెంచ నారంభించినాడు. ఈయంకము నెట్లాపవలయును? అంక మారంభించుటకంత ప్రయత్నము చేసినాడుగదా ? అంకమును చివరకు పుటుక్కున త్రెంచివేయుటయా ? సరిగా నట్లే కన్పించుచున్నది.

తీవ్రాఘాతప్రతిహతతరుస్కంధలగ్నైకదన్తః
పాదాకృష్టవ్రతతివలయాసంగసంజాతపాశః
మూర్తో విఘ్నస్తపస ఇవ నో భిన్నసారంగయూథో
ధర్మారణ్యం ప్రవిశతి గజ స్స్యందనాలోకభీతః.

చెట్టుబోద పెల్లగింపబడినది ఒక దంతముమీదగలది. కాలికి తీగలు పెనవేసికొనినది, లేళ్ళను బెదరగొట్టునది, స్యందనాలోకభీతమైన గజము తపస్సుయొక్క

విఘ్నము మూర్తి తాల్చినట్లు ధర్మారణ్యమున ప్రవేశించుచున్నది.

అనసూయా ప్రియంవదా శకుంతలలు కొంచెము గాబరాపడినారు. రాజు సైనికులు తన్ను వెదకుచు తపోవనోపరోధముచేయుచున్నా రనుకొనెను. అనసూయ అరణ్యగజవృత్తాంతముచేత తాము పర్యాకులలమైతి మని చెప్పినది. ఇం దొకదాని కొకటి సంబంధము లేదు. ఏన్గు ధర్మారణ్యమున ప్రవేశించుచున్న దనగా సైనికులు తన్ను వెదకికొంచు వచ్చుచున్నారని రాజను కొనుటయేమి? ఆయేన్గు రాజుసైన్యము లోనిదా? అయినచో అనసూయ అరణ్యగజవృత్తాంతమను నేమి? ఆమెకు తెలియదా? ఒకవేళ రాజుసైన్యము లోనిదేయైనను అట్లు చెదరిన యేనుగు ఆపద్హేతువే యగును.

ఈ రీతిగా గజవృత్తాంతమును తెచ్చి కాళిదాసంక మును పూర్తిజేసెను. అంకమును పూర్తిచేయుటకు తీసికొనివచ్చిన గజమైనచో నదియొక యసమర్థమైన శిల్పిచేయవలసిన పని. అంకము నెట్లో పూర్తిచేయ వలయును గనుక నేనుగునకు మదమెక్కినదన్నాడు. బెదరినదన్నాడు. స్త్రీలు చకితలైనారన్నాడు. అడవి గనుక, ఏనుగు లుండవచ్చును గనుక, అడవిలోని యేనుగులు స్యందనాదులెరుగవు గనుక, చూచి బెదర వచ్చును గనుక, ఈ యకారణసామగ్రి స్థూలమైన యౌచితిని సంపాదించి పెట్టును. కాని నాటకమును పెంచుకొని పోవలయునన్న తాత్పర్యముతో నక్కడి కంకము నావనుద్దేశించి ఎట్లో ఒకట్లంకమును పూర్తి చేయుటకు కల్పించిన కథాదృష్టితో నప్రస్తుతమైన కల్పనగా నది నిస్సందేహముగా భాసించును. కథా వస్తువు వేఱు. దానిని పది యంకములుగా విభాగించు విద్య వేఱు. కవియొక్క గొప్పతనము, కల్పనా చాతుర్యము, నేర్పు, ఇట్టి విభాగము చేయుటలో వృథా కల్పనలు లేకుండ సప్రయోజనమైన కల్పనలు చేయుటలో నుండును. అంకము పూర్తిజేయుటయే తాత్పర్యమై బాహిరములై యింతకుమున్ను చూపిన యౌచిత్యాభాసములే కారణముగా నీ యేన్గు తీసికొని రాబడినచో కాళిదాసు శిల్పమున కిదియొక మచ్చయై యుండెడిది. కనీస మీ యంకమును పూర్తిచేయు విషయములో చాల సామాన్యమైన నాటకకర్త యయ్యెడివాడు.

'మోచితా వ్యనుకంపినార్యేణ'తో నాటకములోని కథ పూర్తియైనది. కాని కాలేదు. లోకములో నితర కథలు పూర్తియయ్యెడివి. ఈ కథ పూర్తికాదు. ఈ కథయొక్క పట్టంతయు తరువాతనే యున్నది. తృతీయాంకము చివరి వృత్తాంత మీ ప్రథమాంకాంత మున జరుగుటకు వీలులేదు. ఎందుచేత ననగా నేనుగు వచ్చినది గనుక. అది యేనుగుకాదు గజము. ఈ యేనుగనగా నేమియో విచారించవలయును. కాళిదాసు గజశబ్దమునే తప్ప మరియొక దానిని వాడలేదు గదా: దంతి, దంతావళము, అనేకపము, ద్విపము, సింధురము, సామజము, కుంభి, మాతఙ్గము, మదావళము, కుంజరము, వారణము, కరి, ఇభము, స్తంబేరమము, పద్మి ఇన్ని పేరులుండగా గజశబ్దమే యెందుకు వాడవలయును: ఏదియో యొకటి వాడవలయును గదా అందుచేత వాడవలయుననుటకైన వీలుండ వలయును. ఇదే శబ్దమును మరియొక స్థలములో నిచ్చట నే యుద్దేశ్యముతో ప్రయోగించినాడో ఆ యుద్దేశ్యము స్పష్టముగా ప్రయోగించినచో యాదృచ్ఛికముగా ప్రయోగించిన శబ్దము గాదు అని తెలియును. మరల నీశబ్దము నెక్కడ ప్రయోగించి నాడు? ఆ యుద్దేశ్యమేమి?

సప్తమాంకము చివర భగవంతుడైన మారీచ ముని దగ్గర పెండ్లము బిడ్డలతోఁ గూడుకొని తాను శకుంతలను మరచిపోవుట ఎట్లు జరిగినదో తనకు తెలియక దాని రహస్యము మారీచు నడిగెను.

రాజు: భగవ న్నిమా మాజ్ఞాకరీం వో గాంధర్వేణ వివాహే నోపయమ్య కస్యచి త్కాలస్య బంధుభి రానీతాం స్మృతివైకల్యాత్ప్రత్యాదిశ న్నపరాద్ధోస్మి తత్రభవతో యుష్మత్సగోత్రస్య. కణ్వస్య పశ్చాదేనా మంగుళీయకదర్శనాదూఢపూర్వా మవగతో ఉహం. తచ్చిత్ర మివ మే ప్రతిభాతి.

యథా గజో నేతి సమక్షరూపే
తస్మి న్నతిక్రామతి సంశయ స్స్యాత్
పదాని దృష్ట్వాతు భవే త్ప్రతీతి
స్తథావిధో మే మనసో వికారః.

మాతలిః : (1) వత్స. అలమాత్మాపచారశంకయా. సమ్మోహ స్త్వ య్యువపన్నఏవ. శ్రూయతాం.

రాజా : అవహితోఽస్మి.

మారీచః : యదైవాప్సరస్తీర్థావతరణా త్ప్రత్యాదేశ విక్లబాం శకుంతలా మాదాయ మేనకా దాక్షాయణీ ముపగతా, తదైవ ధ్యానా దవగతోఽస్మి. దుర్వాస శ్శాపా దియం తపస్వినీ సహధర్మచారిణీ త్వయా ప్రత్యాదిష్టా, నాన్య దేతి. సచాయ మంగుళీయకదర్శ నావసానః.

రాజా. (సోచ్ఛ్వాసమ్) ఏష వచనీయాన్ముక్తో ఽస్మి.

(రాజు : భగవంతుడా! ఈ నీ సేవకురాలివి గాంధ ర్వమున వివాహమై కొన్నాళ్ళ కామె నామె బంధు వులు తీసికొనిరాగా, స్మృతి వికలముకాగా, ఈమెను నే నెరుగనని తప్పుచేసితిని. ఆ తప్పు పూజ్యుడైన కణ్వునియందు. తరువాత ఉంగరమును చూచితిని. ఈమె నా భార్యయని తెలిసికొంటిని. ఇది నా బుద్ధికి చిత్రముగా నున్నది.

ఎదురుగా నుండగా ఇది ఏనుగు కాదని అది వెడలిపోయిన తరువాత ఏనుగేమోనని, అడుగులు చూచి ఏనుగేనని. నా మనోవికార మట్లున్నది.

మారీచుడు: దీనిని ధ్యానమునందు దెలిసికొన్నాను. దుర్వాసుని శాపమువలన నీవట్లుచేసితివి. మరి యే కారణమును కాదు. ఆ శాపముయొక్క బలము ఉంగరమును చూచువరకే.

రాజు : (అమ్మయ్య, నాకు వి ం ద పో యి న ది.) ఇచట మరల గజము వచ్చినది. విస్పష్టమైన యర్థ ములో వాడబడినది. దుష్యంతుడు తనకు గలిగిన మరుపుయొక్క లక్షణము గజశబ్దమును తీసికొని విస్తరించినాడు. కనుక, ప్రథమాంకాంతమందలి గజ శబ్దము దీనికి సంబంధిగా భాసించక తప్పదు. కాళిదాసు గనుక, ప్రయోజనరహితమైన కల్పన చేయడు గనుక. గజమనగా వ్యుత్పత్తి యేమి? గజతి మాద్యతీతి గజః - గజమదే - మదించునది. మదమనగా నేమి? మది హర్షగ్లేపనయోః ఇది గజ శబ్దార్థము. మద మేమిచేయును? విస్మరింప జేయును, మరచిపోవునట్లు చేయును. మదమనగా మరచిపోవుటయే. స్మృతి లేకపోవుట, కన్నులునెత్తి కెక్కుట. ఈ గజము అనగా ఈ మరపు ఈ కథ కాయువుపట్టు. శకుంతలను దుష్యంతుడు వివాహ మాడినంతలో నీ కథ పూర్తికాలేదు. నిజముగ నీ కథ మొదలుపెట్టుచున్నదియే యక్కడ. అందుకనియే మోచితాస్యను కంపే నార్యేణ-అన్నమాటతో సంపూర్ణ మైన వారి సంయోగ వృత్తాంతము వెంటనే గజ వృత్తాంతము తీసికొనిరాబడినది.

ఈగజ మెటువంటిది! మూర్తో విఘ్న స్తపస ఇవ నః - మా తపస్సుయొక్క విఘ్నముయొక్క మూర్తి వలె- ఇది నేపథ్యోక్తి. నః అనగా నెవరు? ఇది చూళిక. ఎవనిచేత చెప్పబడినది? సూతమాగధాదుల చేత చెప్పబడును. వారు నాటకప్రయోగకుశలులు. నాటకకథా వస్త్వైకాకారులు. తదభిన్నులు. అందుచేత నః అన్నమాట శకుంతలా దుష్యంత ప్రియంవదా నసూయా విదూషకాదులందర నాక్రమించుచున్నది. అందరకు విస్మృతి కమ్మినది. అందరి యొక్క తప స్సునకు నిదియొక మహాంతరాయమైనది. ఆ యంత రాయము మూర్తికట్టినట్లు వచ్చినది యీ యేనుగు. ఆ యంతరాయమే యీ యేనుగు. ఆ యంతరాయము విస్మృతి. విస్మృతి యనగా మదము. మదమనగా గజము. ఈ గజముతో ప్రథమాంకము పూర్తియైనది. ఈ గజకల్పన అల్పబుద్ధియైన శిల్పిచేసినది గాదు. పరిణత ప్రతిభావంతుడైన కవికుల గురువు చేసినది. అందుచేత వైయర్థ్యములేదు. శిల్ప ప్రయత్నమునం దసంయమతలేదు.

ఈ గజము స్యందనాలోకభీతము. స్యందన శబ్దముయొక్క యర్థము ప్రథమ వ్యాసమునందు పొందుపరుప బడినది. స్యందన మనగా వట్టి రథము

గాదుగదా. బయటికి భాసించు సామాన్య కథకు రథము. లోన భాసించు భావలోకములలో నిది రస ప్రవణము. దానిని చూచి యీ గజము భయపడ్డది. ఈ భయపడుటయొక్క స్వరూపము రస విషయము చెప్పునపుడు ప్రస్తావింపబడును. ఏలననగా భయ శబ్దార్థమును నిరూపించి అప్పుడా రసము తచ్ఛబ్దా ర్థానుసారముగ కాళిదా సెట్లు ప్రపంచించెనో చెప్ప బడ వలయును.

ఈ యేను గెక్కడ ప్రవేశించుచున్నది? ధర్మా రణ్యం ప్రవిశతి. ధర్మారణ్యమును ప్రవేశించుచున్నది. దుష్యంతు డా శకుంతలను గాంధర్వ ధర్మమున వివాహమాడెను. వారి దాంపత్యము, వారి వివాహము సర్వము ధర్మమైనది. ఆ ధర్మము అరణ్యమువంటిది. ఎందుచేత? ఆయన పెండ్లిచేసికొనెను. ఆమె గర్భవతి యయ్యెను. తోడనే తీసికొని పోలేదు. ఈసంగతి అచ్చట నెవ్వరికిని తెలియదు. అరణ్య ములో నొకచోటివార్త యింకొకచోటి కందుట కష్ట మైనట్లు వారి వివాహసంబంధమైన ధర్మముగూడ కొంత యరణ్య సామ్యమును పొందియున్నది. అందులోనికీ మరపు చొచ్చినది. అందుచేత నీ గజము ధర్మారణ్యం ప్రవిశతి. ఈగజ మింకెటు వంటిది? తీవ్రమైన దెబ్బచేత భగ్నమైన చెట్టుబోద తగుల్కొన్న యొక దంతము గలది. ఇచట స్కంధము, తరువు, దంతము మూడు శబ్దములు గలవు. స్కంధమనగా నేమి? స్కందిర్ గతి శోషణయోః. పొందించునది. చెట్టునకు వేరు క్రింద కొమ్మలు పైన, నడిమిభాగము స్కంధము. వేరు వివాహము. దాని కెప్పుడును భంగములేదు. మొదటి మూడంకములలోని వృత్తము. శాఖా పత్ర పుష్ప ములు సప్తమాంకము. అచ్చటి వృత్తమును బాగుగనే యున్నది. నడిమి స్కంధము పంచమాంకము. ఇందలి వృత్తమును ఏన్గు తీవ్రాఘాతముచేత కొట్టి తనయొక్క దంతమునందు లగ్నపఱచినది. లగ్న మైన యేకదంతము కలది. రెండు దంతములు కావు. కావని రసచర్చావిషయమునందు తెలియును. దంత మనగా దమ్ ఉపశమే అన్న ధాతువునుండి పుట్టిన శబ్దము. ఈ విస్మృతి ఏమిచేసినది? వివాహ ధర్మమును సగమునం దుపశమింపజేసినది. ఇది ఏక దంత శబ్ద స్వారస్యము. పూర్తిగా నైనచో నాటక విచ్ఛిత్తి, రసవిచ్ఛిత్తి, సర్వ విచ్ఛేదమును. బలవత్తు దూయమానం ప్రత్యాయయతీవ మే హృదయం— మూఢ స్యా మహం ఏషా వా వదేన్మిథ్యా-మయ్యేవ విస్మరణ దారుణ చిత్తవృత్తౌ-కాన్వి దవగుంఠనవతీ నాతిపరిస్ఫుట శరీరలావణ్యా। ఈ సర్వమైన యర్థ ములను మరచిపోయి, మరచిపోనిస్థితిని దీనినే స్కంధలగ్నైకదంతత్వముగా చెప్పినాడు కాళి దాసు. తరుశబ్దమున్నది. తౄ ప్లవన తరణయోః- అని. దీనిచేత నాతపాదులను తరింతురు. ఇచట పున్నామనరకాదు, ఆతపాదులు. అందుచేత శకుం తలావివాహము తరుభూతమైన వస్తువు. స్కంధ మనగా ఆ వివాహధర్మము కొనసాగుట. దాని స్మృతి చెడిపోకుండ నుండుట. ఈ స్మృతి చెరిసగమై ఒకసగము శాపవశమున గజదంతమునందు తగుల్కొన్నది.

ఈగజ మింక నెటువంటిది? భిన్నసారంగ యూధము. సారంగయూధము భిన్నమైనది. భేదింప బడినది. బెదరిపోయినది. సారంగ మనగా వ్యుత్పత్తి యేమి? సంహత్య అరంగచ్ఛతీతి సారంగః. లేనిచో సారా ణ్యంగాని యస్య సః. రెండవ వ్యుత్పత్తి లేడి యన్న యర్థములో. మొదటి వ్యుత్పత్తి చాతక మన్న యర్థములో లింగంభట్టు వ్రాసెను. అది లోకదృష్టితో వ్రాసినది. ఉభయత్ర సమన్వయపరచవచ్చును. లేళ్లు గుంపులుగా దిరుగునుగదా. దానికేమి? మదము విస్మరణ మన్న యీ గజమువలన నేమైనది? సారంగ యూధము భిన్నమైనది. సామాన్యార్థము చెదరి పోయినది. విశేషార్థము భిన్నలక్షణములుకలదైనదని. రాజు తాను శకుంతల నెరుగ నన్నప్పుడు శకుంతలా మనోలక్షణము వేరు. శార్ఙ్గరవుని లక్షణము వేరు. శారద్వతుని లక్షణము వేరు. గౌతమియొక్క లక్షణము వేరు. శారద్వతు దేమియు మాటాడడు. శార్ఙ్గరవుడు

సోల్లుంఠనముగా మాటాడును. మరి గౌతమి: అయ్యో, నాయనా, బిడ్డ యేమైపోవునురా యని యామె గోల. ఇంక శకుంతల. భగవతి వసుధే దేహిమే వివరమ్, తల్లీ, భూదేవతా, నన్ను నీలోనికి తీసికొనవమ్మా; ఈగజమిట్లు భిన్నసారంగయూధము. ఎవరిత్రోవ వారిదే. అనగా ఎవరి యభిప్రాయము వారిదే.

పాదాకృష్టవ్రతతివలయాసంగసంజాతపాశః. పాదములచేత ఆకృష్టమైన వ్రతతులయొక్క వలయముయొక్క ఆసంగముచేత సంజాతమైన పాశముగలది. ఈ పాశము పాదమునందు. నాల్గు వంతులలో ఒకటవవంతు. తక్కిన మూడు వంతులు బంధింపబడలేదు. ఆ మూడువంతులు అంతఃకరణప్రవృత్తి. విస్మృతి మాత్రమే పాదము. దీని స్వరూపము అంతఃకరణలక్షణవిచారణము చేయునప్పుడు చెప్పబడును. కొలదిగా దానిస్వరూప మిది. సా చ వృత్తి శ్చతుర్విధా. సంశయో నిశ్చయః గర్వః స్మరణ మితి. ఏవంవిధవృత్తిభేదేన ఏక మన్తఃకరణం మన ఇతి బుద్ధి రితి అహంకార ఇతి, చిత్త మితి చాఖ్యాయతే. తదుక్తమ్. మనోబుద్ధి రహంకార శ్చిత్తం కరణ మాన్తరం. సంశయో నిశ్చయో గర్వః స్మరణం విషయా ఇమే.' ఈ వృత్తి నాల్గు విధములు. అందులో స్మరణము ఒకటి. దాని యందు మద మేర్పడినది. అదియే గజము. ఏనుగు వ్రతతి వలయాదులు అందుచేత చతుర్థాభూతమైన యీ అంతఃకరణ వృత్తియందు నాల్గవ భాగము. అనగా ఒకపాదము. కనుకనే పాదాకృష్టవ్రతతి వలయ.... మొదలైనది వ్రాయబడినది. నాల్గవ భాగము నందు తగుల్కొన్నది తక్కిన మూడుభాగములను గూడ నంత బాధించునాయనగా అందుచేతనే ఆసంగ మన్న శబ్దము వాడబడినది. ఆ-సమంతాత్-దీనికింత శక్తి యెట్లు వచ్చినదనగా వల్లీతు వ్రతతిర్లతా - అది తతి. తనూవిస్తారే దానికి విస్తృతికలదు. ఈరీతిగా ఇది వ్యాపించినది. నడచుటకు భంగకరముగా నున్నది. కాని ఏనుగు గనుక లెక్కచేయుటలేదు.

ఈరీతిగా నీ శ్లోకమంతయు 'గ్రీవాభంగాభిరామం' అన్నశ్లోకమును 'యదాలోకేసూక్ష్మం' అన్నశ్లోకమును సర్వకథ నెట్లు వ్యఙ్ఞ్యమానములు సేయుచున్నవో కథకు ప్రాణభూతమైన విస్మృతియొక్క సర్వస్వరూపము ఈ శ్లోకము వ్యఙ్ఞ్యమానముగాఁ జేయుచున్నది.

ఈ గజవృత్తాంతమును కాళిదాసు యాదృచ్ఛికముగాఁ దీసికొనిరాలేదు. తన మహాశిల్పములో పరమమైన నాభిస్థానముగాఁ జేసినాడు. అంక మెట్లు పూర్తిచేయుదుమా అన్న అల్పుడైన కవియొక్క దేవులాటకును దీనికిని సంబంధములేదు.

అందుకనియే రాజు ఆ యేనుగునుగూర్చి భావింప లేదు. ఆయన కీ గజరహస్యము నాటకాంతమునందు తెలియును. 'యథా గజో నేతి సమక్షరూపే' అన్న సంశయము ఆయనకు గలిగినది నాటకావసానము నందు. అందుకనియే ఆయన సైనికా మదన్వేషిణ స్తపోవన ముపరున్ధన్తి. భవతు గమిష్యామి తావత్। అని నేపథ్యోక్తములైన రెండు శ్లోకములలోని ప్రథమశ్లోక తాత్పర్యానుబంధిగా పలికినాడు. గజ విషయకమైన రెండవ శ్లోకార్థము అనసూయాదులకు పట్టినది. 'అనే నారణ్య గజవృత్తాంతేన పర్యాకులాస్మః' అన్నది శకుంతలా ప్రియంవదల యొక్క గూఢచిత్తవృత్తులను కలిపికొని అనసూయ. ఆమె యెందుకనవలయును? నాటకము మొత్తము మీద దూర్వాసునిశాప మెరిగిన దిద్దరే. అనసూయా ప్రియంవదలు. ఈ శాపము విషయ మింకెవ్వరికిని తెలియదు. తక్కినవారందరును దాని ఫలితముల ననుభవించినవారే. ఇది శాపమని వారిద్దరికే తెలియును. ఈ విస్మృతిరూపమైన శాపమను గజవృత్తాంతము చేత పర్యాకులలైనది ప్రియంవదానసూయలు. మరి కాళిదా సామె చేతనే యీమాట యనిపించినాడు.

మరి వెంటనే రా జేమన్నాడు: గచ్ఛన్తు భవత్యః వయమ ప్యాశ్రమపీడా యథా న భవిష్యతి, తథా ప్రయతిష్యామహే। ఇచ్చట ఆశ్రమపీడా అన్నశబ్దము జరుగునట్టి కథలో ముని యాశ్రమమని యర్థము. అంతరమైన కథలో గృహస్థాశ్రమమని యర్థము.

మరియు, గచ్ఛతి పురశ్శరీరం ధావతి పశ్చాదసంస్తుతం చేతః। శరీరము ముందునకు పోవుచున్నది. అసంస్తుతమైన చేతము వెనుకకు పరుగెత్తుచున్నది. శరీరం గచ్ఛతి. చేతః ధావతి. స్మరణము నాల్గవ భాగము. తక్కినవి మూడు భాగములు. దీనికన్న దానివేగ మెక్కువగదా! అసంస్తుత మనగా నపరిచితమైనది. పరిచయములేనిది. స్మృతిరాలేదు. పంచమాంకము రాలేదు. షష్ఠాంకమున నంగుళీయక దర్శనము వరకు ఆ రాజు మన స్సెంత గుబ్బిపలాడినది ? స్మరణరాదు. అంతఃకరణప్రవృత్తి జాగ్రద్భూతమైయున్న మహాసత్పురుషుడు. ఆయన యొక్క చేతస్సు పశ్చాద్ధావత్యేవ.

ఇది యభిజ్ఞానశాకుంతలములోని ప్రథమాంకగత రచనావైశిష్ట్యము. సృష్టిలో నిట్లెవ్వడును చేయలేడు. ఆయన ముందు మరియొకడు నాటకకర్త యేమిటి ? భారతీయుడై యింకొకరీతిగా ననుకొన్నచో నది యపచారము. అతడు అత్మభుడు.

కోటగిరి విశ్వనాథరావు | రాజశిల్పి*

కొండవీటి రాజ్యమును పరిపాలించిన కుమరగిరి ప్రభువునకు సంబంధించిన విషయమే ఈ "రాజశిల్పి" నవలలో నితివృత్తము. ఈ నవలలోని కథ చాల చిన్నది. గ్రంథకర్త ప్రతిభావంతుఁడైనచో నెంత చిన్నకథనైనను, సన్నివేశ కల్పనాచాతుర్యముచేత, సంభాషణావైచిత్రిచేత సమయోచిత వర్ణనాచమత్కారముచేత గ్రంథమును శిల్పమయముచేసి రసవంతముగా రచింపగలడు. కావి అదేకథ అప్రతిభుని చేతిలోబడి అరమణీయ సన్నివేశములతో, అనౌచిత్యములతో, నిరంబుమేఘగర్జనలవంటి వ్యర్థమైన వర్ణనలతో పరమదుష్టముగా తయారగుమ: "రాజశిల్పి" ఈ ద్వితీయ మార్గమున పరాకాష్ట నందుకొన్న నవల.

ఈ నవలలో ద్వితీయ ప్రకరణమున వామనభట్టు విజయనగరమున రెండేండ్లు చదువుకొని కొండవీటికి వచ్చి తన స్నేహితుఁడైన కాటయవేమారెడ్డిని చూచుటకు వచ్చును. కాటయవేముడు తన యింటికి పంపిన పల్లకిలోవచ్చి, వామనభట్టు, కాటయ వేముని చంద్రశాల పూర్వద్వారమున ప్రవేశించి పశ్చిమ ద్వారము వైపునకు దృష్టిసారించగా కాటయవేముడు తన భార్య మల్లాంబిక కర్ణమూలమున మందారము చెరువుచుండెను. మల్లాంబిక పతివక్షస్థ్సలముపైనున్న పద్మరాగముపైని గంధపుపొడిని తుడుచుచుండెను. ఈ దృశ్యముజూచిన వామనభట్టు మనసున శాకుంతల వ్యాఖ్యానము మెఱసినదట!

కాటయవేముడు కుమరగిరిప్రభువు బావగారు. కొండవీటి రాజ్యమునకు కిరీటములేని రాజు. మల్లాంబిక కుమరగిరి ప్రభువు చెల్లెలు. ఇట్టివారి చంద్రశాలలో రచయిత యిష్టప్రకారము వామనభట్టు ప్రవేశించి ఆ దృశ్యమును జూచి రాగూడని సమయమున వచ్చితినే అని తలనైన వంచుకొనడు. పైపెచ్చు వామనభట్టునకు శాకుంతల నాటకము గుర్తునకు వచ్చినదట! ఇంతేకాదు. ఇక్కడనే వామనభట్టుసమక్షమున మల్లాంబికా కాటయవేముల సరసము లభివర్ణింపఁబడినవి. వామనభట్టుసమక్షమున రాచపుట్టువు పుట్టిన మల్లాంబిక సరసములాడుట యెట్లు పొసగును? సంప్రదాయము జాతిమర్యాదలు నశించిన ఈ రోజులలో నైనను స్నేహితునియెదుట ఆల్మగలు సరసములాడుట చూడము. కాని ఈ గ్రంథకర్తగారు మాత్రము అవిచ్ఛిన్న సంప్రదాయార్థులైన కొండవీటి ప్రభువులకాలములో పైవిధముగా సృష్టించి చరితార్థులైనారు! వామనభట్టు ఆల్మగల సరసములకు విఱుగబడి నవ్వుచుండగా, తాను కప్పుకొన్న సాలువు జారిపోగా విసిరి వల్లెవాటు వేసికొనుచుండ నురమునందలి బిరుదుపతకము తళుక్కుమనెను. ఆ పతకమును చూచి మల్లాంబిక "ఈ మంగళసూత్ర మెక్కడి" దని వామనభట్టును మేలమాడెనట. పరపురుషుని మెడలోని బిరుదుపతకమును జూచి మంగళసూత్ర మెక్కడిదని మేలమాడుట ఆభిజాత్యము గల కులకాంత కపూర్వమైన విషయము. అప్పుడు వామనభట్టు "హరిహర రాయలువారు కట్టి" రవి సమాధానము నిచ్చును. కాటయవేముడు కలుగజేసికొని కొండవీటికి విజయ

* రచన: పాటిబండ మాధవశర్మ. ఆంధ్ర విశ్వకళాపరిషత్తు వారిచే 1957 పోటీలో బహుమతి పొందిన గ్రంథము. 1958 లో Pre-university విద్యార్థుల ఉపవాచకము.

నగరమునకు పెండ్లి కుదిర్చితివన్నమాట ! అని యనును. భావికథాసూచనకొఱకని ఈ మాటలు రచయిత అనిపించెను. కాని ఆ విషయము నిట్లు చెప్పించుటతో రచయితచేయి తిరుగవితనము వ్యక్తమగుచున్నది. భావికథా సూచనకొఱకని యిట్టి అసందర్భము లగు సన్నివేశము లుత్తమరచయితలు సృష్టించరు. మరియును సూచన వ్యంగ్యముగా నుండవలెనుగాని బట్టబయలు కారాదు. విజయనగర రాజకుమారి హీరాంబిక యక్షరములు ముద్దుగొలుపుచున్నవని కాటయవేముడనగా మల్లాంబిక తన చేతిలోని మల్లెపూవుతో, వామనభట్టు ఎదుటనే, భర్తను గొట్టి వెళ్ళిపోవును. ఇట్లు చిత్రించుటచే మల్లాంబికా కాటయవేముల శృంగారము తక్కువ రకపు సినిమా శృంగారముగా దిగజారిపోయినది. అక్షరములు మెచ్చినందులకే మొగమంతయు మోదుగులు పూయవలెను కాబోలునని అంతిపురములోనికి వెళ్ళిన భార్యను గురించి కాటయవేము డనును. వెంటనే వామనభట్టు "మల్లెపూవు తగిలినందులకే యుల్లమింత తల్లడిల్లవలెను కాబోలు" నని యనును. ఇది యంతయు యనౌచిత్యము. అనౌచిత్యముకన్న రస భంగమునకు కారణములేదన్నాడు ధ్వనికారుడు.

చరిత్రాత్మకమైన నవలయందు సంప్రదాయమునకు ప్రముఖమైన స్థానముండును. ఆ సంప్రదాయమునకు ఎక్కడ పిఘాత మేర్పడినను "వాతావరణ" భంజకమై గ్రంథములోని పరమోద్దేశమే చెడిపోవును. అందుచేతనే చరిత్రాత్మకమైన గ్రంథరచన అసిధారా వ్రతము వంటిది. ప్రథమ ప్రకరణమున కుమరగిరి ప్రభువు వసంతోత్సవసందర్భమున వేణువనమునకు వెళ్ళునపుడు మల్లాంబిక గంధపుష్పాక్షతలతోడి బంగరు పళ్ళెరమున కర్పూరము వెలిగించి మంగళ కైశికీవృత్తిని కుమరగిరి ప్రభువునకు వందనగీతము పాడెనని రచయిత వ్రాసినారు. ఇట్లే తొమ్మిది, ఇరువది ప్రకరణములలో మల్లాంబిక మంగళహారతులు పట్టినట్లు రచయిత వర్ణించినారు. ఇది రాజసంప్రదాయమెఱుగని రచన. రాజుల యిండ్లలో మంగళహారతులు దాసీలే పట్టుదురు. అట్లు మంగళహారతులు పట్టిన వాళ్ళకు బహుమానముల నిచ్చు సంప్రదాయము గలదు. ప్రతి పర్యాయము మల్లాంబిక, అనఁగా కుమరగిరి ప్రభువుసోదరి మంగళహారతి పట్టినట్లు వర్ణించుట సంప్రదాయవిరుద్ధమైన విషయము.

కుమరగిరి తన కుమారుడగు అనపోతారెడ్డి అస్వస్థతకు, అతని యౌవరాజ్యపట్టాభిషేకోత్సవమునకు సంబంధించిన బాధతో శిల్పమందిరమున శయనించియున్నపుడు మల్లాంబిక పిలువబడి ఒకపాట "కచేరీ" చేయును. కుమరగిరి కీ విధముగ పాడించుకొనుట అలవాటేయనికూడ చెప్పబడినది. ఇట్లే యువరాజు కుమారాన్నపోతారెడ్డి మరణశయ్య మీద నున్నప్పుడుకూడ మల్లాంబికచేత పాడించినారు రచయిత. యువరాజు మరణానంతరము రాత్రులందు మల్లాంబిక జోలపాడి కుమరగిరిని నిద్రపుచ్చి, ఉదయములందామె మేల్కొలుపులు పాడి ఆయనను నిద్ర లేపెడిదట. అన్నాచెల్లెండ్రు చిన్నతనమందెంత చనువుగానుండి కాలము గడపినను గడుపవచ్చును. కాని ఇర్వురును పెద్దవారై వివాహములను చేసికొని జీవితములు గడుపుచున్నప్పుడు చిన్నతనపు చనవుండదు. వారిరువురును విదూరులగుదురు. అందులోను రాజకుటుంబములలో మరియు దూరస్థులుగా భాసించెదరు. ఈనాడు తలనొప్పిగా నున్నది. ఒక పాటపాడి పొమ్ము. ఈనాడు జ్వరము వచ్చినది. కమ్మని గీతము పాడి పొమ్ము. ఈ రాత్రి నిద్రవచ్చుటలేదు ఒక జోలపాట పాడిపొమ్ము అనుటకు మల్లాంబిక ఆస్థాన సంగీత విద్వాంసురాలు కాదు. ఇట్లు చిత్రించుటచేత రాజకుటుంబములలోని ఉదాత్తలక్షణములను హుందాతనములోని సొగసులను గురించి యూహించు శక్తియైన ఈ రచయితకు లేదని స్పష్టమగుచున్నది.

కుమరగిరి శిల్పమందిరములో బాధతో శయనించియున్నపుడు మల్లాంబికసంగీతమును రచయిత వర్ణించును. ఆ వర్ణన యంతయు శృంగారరసాభిముఖముగా సాగినది. ఏ సందర్భమున నే విధముగా వర్ణింపవలయునో ఈ రచయితకు తెలిసినట్లు లేదు.

కుమరగిరి వరన సంగీత సాహిత్యచక్రవర్తి. ఈతనిలో నాయకోచితగుణములమాట అటుంచి పురుషోచితలక్షణాదులుకూడ ఈ గ్రంథమందు కల్పించవు. ఎంత సంగీతనాట్యలోలుపుడైనను కుమరగిరిని యీ రచయిత సృష్టించినంత అసమర్థుడుగా నే చరిత్రకారుడు చెప్పలేదు. ఆరవ ప్రకరణమున కుమరగిరిప్రభువు బాధ వర్ణింపబడినది. అయితే యెందుకు కుమరగిరి యింత బాధపడుచున్నాడో అంతుపట్టదు. ఎన్నడో మరణించిన భార్య కోసమా ? కాదు. అస్వస్థుడైయున్న యువరాజు విషయమా ? అట్లుకూడ కనిపించదు. కాని యువరాజుయొక్క యౌవరాజ్యపట్టాభిషేకమునకు సంబంధించి విచారగ్రస్తుడైనట్లు కాటయ వేమారెడ్డి ప్రసంగమువలన వ్యక్తమగుచున్నది. అయితే యౌవరాజ్య పట్టాభిషేకవిషయమై ఎందుకు బాధపడవలె ? తాను రాజుకదా ! తన కుమారునకు యువరాజపట్టము గట్టుటకోసమని బాధతో ముసుగుపెట్టుకొని మూల పరుండుట యెందుకు ? ప్రభువుయొక్క యవస్థనంతను స్వప్నముగా కాటయవేముడు వర్ణించును. జీవునకు జాగృతియే కృతకము, స్వప్నమే సహజమని ఒక విచిత్రసిద్ధాంతమును ఇప్పట్టున కాటయవేముడు పాదుకొల్పును. స్వప్నములను గురించి విపులముగా చర్చించినవారు కూడ ఇట్లు చెప్పలేదే ! సర్వసాధారణముగా స్వప్నములు మానవులకు జాగ్రదవస్థయందు ఈడేరని కోరికలే మారురూపములతో సాక్షాత్కరించునని శాస్త్రజ్ఞుల యభిప్రాయము. ఈ రచయిత స్వప్నమందుండి ఈ స్వప్నశాస్త్రము సృష్టించలేదుగదా ! ప్రభువుదురవస్థ చూడలేక కాటయవేమారెడ్డి అనపోతారెడ్డి యౌవరాజ్య పట్టాభిషేక మహోత్సవమును నిర్ణయించి ప్రభువునకు తెలిపెను. ఈ వార్త విని కుమరగిరి కాటయవేముని కౌగలించు కొనెను. కొంతసేపటికి ఆనందాశ్రువులతో తన్నభిషేకించుచున్న కుమరగిరి కంటినీటిని కాటయవేముడు కరాగ్రమున పరామర్శించెనట ! పక్ష్మంచల సంలగ్నమగు నశ్రుకణముల నప్పళించుకొనుచు కుమరగిరి తన ముద్దుల మఱంది మొగమును మోహపు చూపుల ముద్దులాడెనట. ఇదియేమి చిత్రణ ? కాటయవేముడు కుమరగిరి కలిసికొన్నప్పుడు ఇట్లాచెప్పుట ? నాయికానాయకుల సంయోగమువలె నున్నదికాని ఇర్వురు ధీరోదాత్తులైన పురుషులు కలిసికొనినట్లు లేదు. చరిత్రప్రసిద్ధులైన మహాపురుషులను, ఇంత దుష్టముగా చిత్రించుట క్షంతవ్యము కానేరదు. మన యూహలు పలువిధములుగా నుండవచ్చును. కాని వానిని చరిత్ర ప్రసిద్ధులైన పురుషుల కంటగట్టుట మహాపచారము.

కాటయవేమారెడ్డి మీసాలలో కులుకులుపోయెనని ద్వితీయ ప్రకరణములోను, కడకన్నులలో కులికికొనెనని పదమూడవప్రకరణములోను వ్రాయబడియున్నది. పురుషసింహమైన కాటయ వేమారెడ్డి కులికికొనుట యేమిటి ? ఈ రచయిత పురుషులను గురించి చెప్పునప్పుడు కూడ స్త్రీ ప్రవృత్తి వెలువరింపబడును. దీనికి కారణమేమిటో మన కర్థముకాదు. అనంతయ్య నవ్వు వర్ణించినప్పుడు కూడ నింతే.

శ్రీనాథ కవి పేరు మొదట తిరుపతయ్య అనీ ఆ పేరుయొక్క సంస్కృతీకరణమే శ్రీనాథు డనీ ఈ రచయిత కల్పించినారు. ఇట్లు మార్చుకొన్నట్లు మన కాధారము లేమియు లేవు. శ్రీనాథుడు పేరు మార్చుకొనుట వలన కథలో ఏ ప్రయోజనము సిద్ధింపదు. అసలీనవలలో శ్రీనాథుని పాత్రవలన సాధింపబడినదేమియు లేకపోగా శ్రీనాథుని పాత్రమాత్రము అనుదాత్తముగా ఉన్నది. శ్రీనాథుని మామగారగు తిప్పయ్యగారు తిరుపతయ్యా అని పిలచినప్పుడు "ఈ వెధవ తెలుగుపేరు నా కసహ్యముగా నున్నదని" శ్రీనాథుని చేత అనిపించినారు రచయిత. శ్రీనాథుని కావ్యాలు చదివినవా రెవరు పైవిధముగా శ్రీనాథుడు పలుకునని తలంచరు. తెనుగుదేశము మీద తెనుగు భాష మీద శ్రీనాథుని కున్న గౌరవప్రేమ లపారమైనవి. భీమేశ్వర పురాణములో తెనుగు దేవుళ్ళను, తెనుగు నదులను, తెనుగు పొలాలను తనివితీర వర్ణించిన శ్రీనాథుడు "వెధవ తెలుగు" అని కలలో

కూడ ఉచ్చరింపడు. ఎవడైన అన్నను ఊరుకొని యుండడు. దేశీయ వీరుల గాథలనే యితివృత్తము లుగా స్వీకరించి, దేశీయ ఛందస్సులో పల్నాటి వీర చరిత్ర, కాటమరాజు కథలను రచించిన తెనుగు దేశాభిమాని శ్రీనాథమహాకవి. పూర్వాంధ్ర కవులలో నింత దేశాభిమానముగల కవి మరొక్కడు లేడని చెప్పినచో అతిశయోక్తి కానేరదు. అట్టివానినోట "వెధవ తెలుగు" అని యనిపించుట దేశద్రోహము వంటిది.

వైష్ణవాభిమానియైన అనంతుని దర్శనార్థము వెళ్ళుచు శ్రీనాథుడు తన కంఠమందలి యిష్టలింగ మును కటిసూత్రమున గట్టుకొని పాతసేలువ భద్ర ముగ నడుమున జుట్టుకొని వెళ్ళెననియు శివభక్తుడైన మామిడిసింగనగారి దగ్గరకు వెళ్ళునప్పుడు నడుము దడవికొని సందుమలుగునకు వెళ్ళి గళమున మరల లింగమును గట్టుకొనివచ్చి శివభక్తులలో జొరబడెనని వ్రాసినారు. ఏ యెండ కా గొడుగు పట్టుట మన కల వాటుగదా యని శ్రీనాథుని అట్లు చిత్రించుట తప్పు.

"బూడిద బుంగవై యొడలు
పోడిమిదక్కి మొగంబు వెల్లనై"

అన్న గాడిదమీది పద్యమును తిప్పయ్యగారి యింటి కొఱకుతిరుగుచు చాకలిపేటలోసందుమలుపున రాతిపై కూర్చొని శ్రీనాథుడు చెప్పినట్లు ఈ గ్రంథకర్త యభి ప్రాయము. ఈ పద్యము కొండవీటిలోని అసమర్థ లైన కవుల నపహాస్యము చేయుటకు వ్రాయబడినది. ఆ పద్యమందు గాడిద ప్రధానముకాదు. కొండవీటి కవులను వెక్కిరించుటయే ఆ పద్యముయొక్క పరమ ప్రయోజనము. అందువలన ఆనాడే కొండవీటికి వచ్చిన శ్రీనాథ దక్కడ కవుల లోతుపాతులను తెలిసికొనకుండ తన యభిప్రాయముల నెట్లు వ్యక్తీక రించును? అందుచేత శ్రీనాథు డీ పద్యమును కొండ వీటిలో కొంతకాలము గడపిన తర్వాతనే చెప్పి యుండును. శ్రీనాథుని తిప్పయ్యగారి యింటికి చేర్చుటకు గ్రంథకర్త కన్యోపాయము లేక గాడిదయే దిక్కయ్యెను.

నాటకములందు స్త్రీవేషములను ధరించు భాగ వతుల బుచ్చిగాణ్ణి చూచి "మోహములు పొంది కొండవీటి యువరసికు లొడళ్ళఁ గొంకరలు పోవుదు రట"—ఇట్లు చెప్పుట పరమ జుగుప్సావహముగా నున్నది. కొండవీటి యువరసికుల కందరకు ఈ విపరీత దుర్లక్షణము నంటగట్టినారు రచయిత!

అనంతయ్యగారియింటిలో గోడపై మూడడుగుల యెత్తుగల కవిబ్రహ్మ చిత్రము దాని కుడియెడమల నడుగెత్తు గల ఆదికవి చిత్రమును, ప్రబంధపరమే శ్వరుని చిత్రము నలంకరింపబడి యున్నవట. ఏనుగు బొమ్మను ఒక అంగుళములో చిత్రింపవచ్చును. పిపీ లిక చిత్రమును అరడుగుల చిత్రముగా వేయవచ్చును. అందువలన పిపీలిక గొప్పది ఏనుగ తక్కువది అయిపోదుగదా! అసలీకల్పన ప్రౌఢమైనదికాదు. పసితనపు చేష్టగా కనిపించుచున్నది. ఈ సందర్భము లోనే అనంతయ్యగారు "కవిత్వపు లోతులు లోక మంతయు నెఱుంగగలదు. లోకము హృదయముతో ననుభవించి యానందించును. మన మంతతో నాగక బుద్ధిచే వివేకించి విమర్శింతుము. లోకము మూగది. మనము వాచాలురము" అని యనును. దీనినిబట్టి కవితానందమును సమస్తలోక మనుభవించుననియే కదా! ప్రతివ్యక్తికీ కవిత్వ మర్థమగునన్నమాట! ఇంతవర కేమహానుభావుడు ఈవిధముగా చెప్పలేదు. కవిత్వ మెప్పుడును సహృదయుల కొఱకు. సహృద యులు లోకమందు చాల తక్కువ. సహృదయు దనగా, "ఏషాం కావ్యానుశీలనాభ్యాసవశా ద్విశదీ భూతే మనోముకురే వర్ణనీయ తన్మయీభవన యోగ్యతాతే హృదయసంవాదభాజః సహృదయాః" అని. అక్షరజ్ఞానమున్న ప్రతివ్యక్తి సహృదయుడు కానేరదు. కావ్యమునందున్న శబ్దముల కర్థము తెలిసి నంత మాత్రాననే కావ్య మర్థమైనట్లు కాదు. మన కావ్యములందు కేవల శబ్దగతార్థము ప్రధానముకాదు. ప్రతీయమానార్థము ప్రధానము. అది పైన చెప్పబడిన లక్షణములుగల సహృదయ హృదయైకవేద్యము. అంతేకాని ప్రతివ్యక్తి కావ్యగతమైన ఆనందము

సమర్థించునదనుట తప్పు. అనంతయ్యచే ఈ విచిత్ర సిద్ధాంత ప్రచారము చేయించుట సమంజసముగాలేదు.

"నన్నయ్యగారిది కథనమార్గము. అందు కల్పనా వ్యాపారము ప్రధానము. తిక్కన్న గారిది రస మార్గము. అందు సృష్టి వ్యాపారము ప్రధానము. ఒకటి బుద్ధి గోచరమగు ప్రజ్ఞ. వేరొకటి హృదయ గమ్యమగు ప్రతిభ" అని అనంతయ్యగారిచే నీ గ్రంథ కర్త యనిపించెను. కల్పన ప్రతిభాజన్యమైనదే కదా! కల్పనా వ్యాపారము ప్రధానముగా గల నన్నయ్య ప్రతిభావంతు డగుచున్నాడు కదా! మరి నన్నయ్య కేవల ప్రజ్ఞావంతుడని చెప్పుటకు వీలులేదే! అందు చేత గ్రంథకర్తగారు పరస్పర విరుద్ధములగు వాక్య ములను రచించినవారగుచున్నారు.

నవలలో నుండవలసిన కథా నిర్మాణ దక్షత ఈ గ్రంథమందు కనుపించదు. ఆలోపమును దీర్చుటకు ప్రయత్నముచేయుటలో వ్యర్థమైన వర్ణనలు వచ్చిపడ్డవి వీరాస్వామి సన్నాయిపాటల వర్ణనలతో, వసంతోత్సవ వర్ణనలతోను, కాటయ వేమారెడ్డి, వామనభట్టు, అవచి తిప్పయ్యసెట్టి యుపన్యాసములతో నీ నవలలోని మూడింట నొకభాగము నింపబడియున్నది. చేసిన వర్ణన లేమైన కథాగమనమునకు తోడ్పడి, రసాభిముఖముగా పాఠకుని తీసికొనివెళ్ళగలవా? అన్నచో అదీలేదు. వ్యర్థ వర్ణనలతో, ఉపన్యాసములతో పాఠకుడు విసిగి వేసారును.

"కిం కవేస్తేన కావ్యేన కిం కాండేన ధనుష్మతః
పరస్య హృదయే లగ్నం న ఘూర్ణయతి యచ్ఛిరః"

*        *        *

ఇక నీగ్రంథములో చారిత్రకదోషము లనేకములు.

"గజరావు తిప్పానాయకుడు పెదవేదగిరినాయనికి సవతి తమ్ముడు. దేవరకొండ రాజ్యము తనకు రావలెనని తగవులేవదీసి యాతడు దేశభ్రష్టుడై దేవర కొండ వీడి నాలుగైదేండ్లక్రిందట రాయపనాయకుని అండ జేరెను" అని గ్రంథకర్తగారు వ్రాసినారు. గజరావు తిప్పానాయకుడు పెదవేదగిరి నాయనికి సవతి తమ్ముడగుటకు వీలులేదు. పెదవేదగిరి రేచర్ల గోత్రోద్భవుడు. గజరావు తిప్పానాయకుడు కొప్ప నూళ్ళ గోత్రజుడు. తండ్రికి తన తల్లిగాక యింకొక భార్య యున్నచో ఆమె కొడుకు తనకంటె చిన్నవాడై యున్నచో అతడు సవతితమ్ము డగును. ఇక్కడ గజరావు తిప్పానాయకుని గోత్రము కొప్పనూళ్ళ అయినప్పుడు రేచర్ల గోత్రికుడైన పెదవేదగిరికి సవతితమ్ము డెట్లగును? ఈ గ్రంథకర్తకు వావివరుసలు కూడ తెలిసినట్లు లేదు. "గజరావు"లో "రావు" శబ్ద మున్నది కాబట్టి వీరి గోత్రము రేచర్ల గోత్రమగునని తలంచి ఈ యభూతకల్పన చేసినారు కాబోలు! గజరావు తిప్పానాయకుడు మహావీరుడు. ఇతడు కుమరగిరి కాలమున రెడ్డిరాజ్యమును సంరక్షించిన వారిలో ప్రథముడు. విజయనగర ప్రభువు కొండవీటి రాజ్యపు దక్షిణప్రాంతముల నాక్రమించుకొను సమ యమున ఫిరోజిషా సైన్యములు రెడ్డిరాజ్యముపైకి దండెత్తి వచ్చినవి. అప్పుడు గజరావు తిప్పానాయ కుడు ఆ మహమ్మదీయ సైన్యాలను కంబంమెట్టుకడ ఓడించి తరిమివై చెను. ఈ విషయమే గజరావు తిప్పానాయకునిపై చెప్పబడ్డ పద్యమందు మొదటి పాదము వ్యక్తము చేయుచున్నదని శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు వ్రాసినారు. (యవనుల గెల్వదే యంబరాయలు చూడ నెట్లయిన కంబము మెట్టబైట) అందుచేత గజరావు తిప్పానాయకుడు కుమరగిరి మిత్రుడగుచున్నాడు. కాని మన గ్రంథ కర్తగారు తిప్పానాయకుడు కుట్రచేసి త్రిపు రాంతకమున వెలుగోటి రాయపనాయకుని బంధించి కుమరగిరిశత్రువులతో కలిసినట్లు చిత్రించి నారు. ఈ కల్పన చరిత్రవిరుద్ధమైనది, వెలుగోటి రాయపనాయకుని తిప్పానాయకుడు బంధించినట్లు వ్రాసినారు, ఇది అసత్యము. ఎందుచేతననగా కుమరగిరి తర్వాత కోమటి వేమారెడ్డి కాలమునందు కూడ రాయపనాయకుడు, తిప్పానాయకుడు కలిసియే కాటయ వేమారెడ్డిని గుండుగొలను యుద్ధమున నోడించినట్లు శ్రీ సోమశేఖర శర్మగారి వ్రాతలవలన గూడ తెలియుచున్నది. (కాటయ వేమభూకాంతు

సైన్యంబెల్లఁ గొట్టదే యల గుండుగొలవి (క్రేవ) తనను బంధించిన తన విరోధియైన తిప్పానాయకునితో కలిసి వెలుగోటి రాయపనాయకుడు కాటయ వేముని ఓడించుట పొసగదుకదా। అందుచేత తిప్పానాయకుడు వెలుగోటి రాయపనాయకుని బంధించినాడని చెప్పుట తప్పు.

విజయనగర సైన్యము, కొండవీటి సైన్యము కలిసి క్రొత్త కొండకడ, రాచకొండ దేవరకొండ బహ్మనీ సుల్తానుల సైన్యముతో పోరాడి జయించినట్లును, కడకు దేవరకొండకోట వశమైనట్లు పెదవేదగిరి ధర్మదార యూదించినట్లు ఈ గ్రంథకర్తగారు వ్రాసినారు. చరిత్రలో క్రొత్తకొండ యుద్ధమిట్లు జరుగలేదు. అంతర్యుద్ధానంతరము కుమరగిరి త్రిపురాంతకము, శ్రీశైలమండలములను విజయనగర ప్రభువగు రెండవ హరిహరరాయల కడనుండి తిరిగి జయించుటకు కాటయ వేమారెడ్డిని మహాసైన్యముతో పంపెను. కాటయవేమారెడ్డి హరిహర రాయలవారి నోడించెను. ఈ యుద్ధమునకు పూర్వమే హరిహర రాయలు వరంగల్ రాజ్యముపైకి తన సైన్యములను పంపియుండెను. కాని పద్మనాయక ప్రభువులు, బహ్మనీసుల్తాను కలిసి మహబూబ్‌నగరుజిల్లాలో నున్న క్రొత్తకొండకడ హరిహరరాయల వారిసైన్యమును ఘోరపరాజయము పాల్జేసిరి. అందుచేత హరిహరరాయలు కాటయవేమారెడ్డిచేత ఓడింపబడి సంధిచేసికొనెను. ఈ స్నేహమును బలీయము చేయుటకు తన కుమార్తెయగు హరిహరాంబను కాటయ వేమారెడ్డి కిచ్చి హరిహరరాయలు వివాహము చేసెను. ఇది చారిత్రకసత్యము. కాని యీ గ్రంథకర్తగారు క్రొత్తకొండకడ కాటయవేమారెడ్డి రాచకొండ, దేవరకొండవారిని ఓడించినట్లు వ్రాసిరి. ప్రసిద్ధమైన చారిత్రక ఘట్టములను రచయిత తన యిష్టము వచ్చినట్లు మార్చకూడదు. కథానిర్మాణ దృష్టితో కొద్దిమార్పులు చేసినా అసలు చరిత్రకే ఎసరు పెట్టకూడదు. కాటయవేమారెడ్డి హరిహరాంబల వివాహము చరిత్రలో నున్నట్లుగా చిత్రించినచో నెంతయో బాగుండెడిది. కాటయ వేమారెడ్డి కీర్తి ప్రతాపములు ద్విగుణీకృతములై యుండెడివి. కాని రచయిత అనవసరముగా రాచకొండ దేవరకొండ వారిని రంగముమీదికి గుంజుకొని వచ్చినారు. కుమరగిరి ప్రభువు రాజ్యము నేలుచున్నపుడు పద్మనాయకులకు కొండవీటివారికి ప్రధానయుద్ధ మేదియు జరుగలేదు. కాని కుమరగిరి చేతిలోనున్న బెండపూడి దుర్గమును పద్మనాయకులు జయించినట్లు మాత్రమున్నది. అటువంటప్పు డనవసరముగా దేవరకొండ కోటను కొండవీటివారు జయించినట్లు; పెదవేదగిరి ధర్మదార యూదించినట్లు వ్రాయుట అన్యాయము. చివరలో కుమరగిరి గండపెండెరమున పెదవేదగిరినికూడ విరికించినారు.

కోమటి వేమారెడ్డి దేవరకొండ ప్రభువుతో కలిసి కొండవీటిపై కత్తిగట్టినట్లుగా ఈగ్రంథమందు వ్రాయబడినది. దీని కాధారములేదు. కుమరగిరిరెడ్డి పరిపాలనానంతరము కొండవీటిరాజ్యము కోమటివేమారెడ్డి కైవసమయ్యెను. ఆసమయముననే కోమటివేమారెడ్డి ఫిరోజిషా సహాయముతో అల్లాడరెడ్డిపై దండెత్తెను. తమ శత్రువైన కోమటి వేమారెడ్డితో స్నేహము చేసికొన్నందుకు దేవరకొండవారు తమ స్నేహితుడైన ఫిరోజిషాను విడనాడి కోమటి వేమారెడ్డి రాజ్యముపై దండెత్తి ధరణికోట కడ మాచారెడ్డిని సంహరించిరి. దీనిని బట్టి కోమటి వేమారెడ్డికి దేవరకొండ వారికి మధ్య నున్న సంబంధము వ్యక్తమగుచున్నది. కాని మన గ్రంథకర్తగారు కోమటి వేమారెడ్డిని దేవరకొండవారి మిత్రుడుగా చిత్రించినారు.

వామనభట్టు కుమరగిరి ఆస్థాన కవిగా ఉండి కోమటి వేమారెడ్డికి వ్యతిరేకముగా ప్రముఖమైన పాత్ర వహించినట్లు ఈ గ్రంథకర్త వ్రాసినారు. చరిత్రను బట్టి చూచినచో వామనభట్టు కోమటి వేమారెడ్డి యాస్థాన కవులలో ప్రసిద్ధివహించినవాడని తేలుచున్నది. ఇతడు బహు గ్రంథకర్త. చిన్ననాడు విజయనగరమున నుండి, తరువాత కోమటి వేమారెడ్డి

యాస్థానమునకు వచ్చినట్లు చరిత్రజ్ఞుల యభిప్రాయము "వీర నారాయణ చరిత" మని ప్రసిద్ధివహించిన వేమ భూపాలచరితము నీ వామనభట్టు రచించెను. ఈ కావ్యమున నాయకుడు కోమటి వేమారెడ్డియే। వేమ భూపాలుని వీరోచిత కృత్యములే గ్రంథమం దభి వర్ణింపబడినవి. వామనభట్టు కుమరగిరి యాస్థానమున నుండి కోమటి వేమారెడ్డికి వ్యతిరేకముగా తంత్రము నడిపిన ట్లే యాధారమును బట్టి వ్రాసిరో తెలియదు.

కుమారాన్న పోతారెడి యౌవరాజ్యపట్టాభిషేకో త్సవ సందర్భమున అగ్నిదళము ఇరువదియొక్క శతఘ్నులు ప్రేల్చి వందనము సమర్పించిన ట్లీ గ్రంథ కర్త చెప్పినారు. ఇరువదియొక్కమారు శతఘ్నులు ప్రేల్చి వందనము సమర్పించుట భారతీయ సంప్రదా యమే కాదు. ఈ సంప్రదాయము ఇంగ్లీషువారిది. ఆంగ్లేయులు భారతదేశమును పరిపాలించుట మొదలు పెట్టిన దగ్గరనుండి ఈ సంప్రదాయము మనదేశమున ప్రారంభమయ్యెను. ఇంగ్లీషువారు దేశము విడిచి వెళ్ళినా ప్రస్తుత ప్రభుత్వ మా సంప్రదాయమును వదలలేదు. ఇట్టి అప్రాచ్య సంప్రదాయము కొండ వీటిని పరిపాలించిన కుమరగిరి పాలనమున నెట్లుం డును? కుమారాన్న పోతారెడ్డికి అగ్నిదళము ఇరువది యొక్క శతఘ్నులు ప్రేల్చి వందన సమర్పణము చేసెనని వ్రాయుట తప్పేయగును కదా। భారత స్వాతంత్ర్య దినోత్సవములు జరుగునప్పుడు పై సంప్రదాయము పాటింపబడుచున్నది కాబట్టి అది భారతీయ సంప్రదాయమే అనుకున్నారు కాబోలు। సర్వవిధ దోషసంపుటమైన ఈ గ్రంథమున కాంధ్ర విశ్వవిద్యాలయమువారు బహుమతి నిచ్చుట తెనుగుల దురదృష్టము।

# ఉషసి | తుమ్మపూడి కోటేశ్వరరావు

పసిమిమడెక్క త్రొక్కుల
        చివాలున తోకను త్రొక్కబడ్డవై
బుసబుసలాడు వాగులయి
        మూగిన దుమ్ముల వ్రాలు సంజలం
దెసగు మనోజ్ఞరాగరుచి
        నిండిన బంగరు కాంతిపుంజముల్
దెసలకు చిమ్మికొంచు నలు
        దిక్కుల తోచెడు నేత్రపర్వమై.

ఈ బంగారపు కాంతివెల్లిగన
        నాయీ మానసాబ్జమ్మునన్
దోబూచుల్ పచరించుచున్నదెదో
        ముద్దుల్ గుల్క రూపమ్ము ; వే
దో బాలుండయి నల్లజిల్లెడుల
        బొడ్డుల్ వోవి మైచాయతో
గోబృందమ్ముల తోలుచున్నటుల
        దిక్కులంబులందోచెడిన్.

వ్రాలున్ సంజల నేటవాలు కిరణాల్
        వ్యాపించి బంగారు వ
ర్ణాలం జిందెడి ఈ వియత్తల
        ముదంచ న్మోహనాకారమౌ
మౌళిం జిత్రవిచిత్రకాంతి మయ
        పింఛంబౌచు తూగాడి యం
దాలన్ విచ్చెమ ; మైగగుర్పొడువ
        నందాల్ విచ్చె నా చిత్తమున్.

నందాపత్యము నల్లకల్వసిరి
        చందంబందమౌ ముద్దుమే
సం దారాడి పవిత్రమై యమున
        పైనన్ మెల్లగా బ్రాకి గో
సందోహమ్ముల వీపులెక్కి వ్రజ
        యోషాస్వేదముల్ పాపి యా
బృందావీథుల వీచు మందపవనం
        బీనాడు నన్ దాకెడిన్.

ఈ సంధ్యా మృదువాయు వీచికలలో
        నేవో శ్రవః పర్వముల్
గా సంభూతము లౌచునున్నవి
        మనోజ్ఞంబైన విస్వానముల్
గో సంతానము వెంటనంటిచను
        నా గోపీజనప్రాణు వం
శీ సంరావము లేమొ మై పులక
        రించెన్ చిత్తమూగించుచున్.

ఎన్నటి సంజవెల్గులివి
        ఎన్నియుగమ్ములనాటివెన్క పీ
సన్నవి చిన్నిగాలుల కొసల్
        నను బంగరు రంగులోని యీ
చెన్నొలికించు సృష్టి యిటు
        చిన్నరి నల్లని గొల్లవాని నా
కన్నులగూర్చి పెట్టినవి
        కమ్మని యీ యనుభూతి చిత్రమౌ.

"రావా ?"

"రాను."

"మరెలాగ ?"

"నేనేం చేయను ?"

"నన్నేమైనా చెయ్యగలవు."

"........."

"అలా గేడుస్తావెందుకు ?"

"కాదు."

"ఏంకాదు ?"

"మీకోసం."

"నాకోసం నాకు దూరంగా !"

మాట్లాడకుండా వెళ్ళిపోయావు. శూన్యంలోకి చూచి, సూదుల్లాగ నా చూపులు నువ్వు వెళుతున్న దారిలో గుచ్చాను. అయినా నీకు తెలియదు.

ఆ ఉదయం కీకారణ్యంలాగుంది. దట్టంగా బలిసిన పొదల్లాగ మేఘాలు. రాత్రి పొదలపై వాలి ముళ్ళతో అడుకొంటున్న చీకటిలాగ మబ్బులు. చీకటి. నువ్వు "రాను" అన్నప్పుడే ఆ చీకటిని చూడగలిగాను.

నీకోసం వచ్చి, నిన్ను చూచి, పిలిచి, వస్తుంటే కరిగిపోయాను. నువ్వు వస్తూ వక్కమలుపు తిరిగావు. నా హృదయ కవాటాలు మూశేశావు. అలాగే వెనక్కితిరిగి తిరిగి నిన్ను చూశాను. నువ్వుమాత్రం తలుపులు బిగించుకొన్నావు నాతలపులు వాలేనే వెలిగిపోయాయి.

నువ్వు తిరిగివస్తావని కాచుక్కూర్చున్నాను. నువ్వు రావనే తలంపు నాకెప్పుడూలేదు. ఎండిపోయిన కొమ్మలతో గాలి గుసగుసలాడుతూ వెళ్ళిపోతుంటే, పండిపోయిన నా ఆశలో నీకంఠం వినబడుతుంది. నా పెదవులపై నీ పెదవులు అద్దుకుంటాయి. నీ చూపుల్లో నా హృదయం కరిగిపోయి, నీవైపు ప్రవహించి, వెదుకుతుంది నన్ను రమ్మని పిలుస్తావనే ఆశని.

నువ్వు చూడవు.

మాట్లాడవు.

మనిషిలాగ కాక, మంత్రగత్తెలాగ వెళ్ళిపోతావు. నన్ను మంత్రించి నీవెంట తీసుకపోతావు.

నేను నాలోకాక, నాలో నిన్ను నింపుకుని, ఊహా పరిష్వంగంలో కాలం గడుపుతాను.

నీ దగ్గిరికి ప్రయాణం.

నాపై నీకెంత ప్రేమ! కనీసం "రాను" అనైనా చెబుతున్నావు. ఎంతదయ! అమాటైనా చెప్పకపోతే—నన్ను నువ్వేమి చెయ్యాలో అదే చేద్దువు.

రైలు వంతెనదాటి, దూరాలుదాటి, భారాలు మోసి నీకు చేరువగా, అనిమిషంగా ఉన్నాను. ఏవో మాట్లాడుతున్నావు. ఏమి మాట్లాడితేనేం? అవి నాగురించేననినమ్మకం. అదే సంతృప్తి, ఆనందం, సౌఖ్యం; సర్వం నాకు. పైకేమి మాట్లాడితేనేం! నా గురించే లోనమాటలు, ఆటలు. సంజ్ఞామాత్రంగా గోడచాటునుండి నువ్వు కనబడ్డావు. ఆ దివ్యరూప సందర్శనంతో తల్లడిల్లిపోయి, మధురానుభూతుల సంపర్శనంతో సొమ్మసిల్లి, ఆనందం పరిష్వంగంలో నన్ను నేను మరచి; నిన్ను మాత్రం కలిసి, అలాగే ఉండిపోయాను.

నిత్యం నువ్వు కనబడుతున్నావు. ఎక్కడుంటేనేమి గాని, యెప్పుడూ నువ్వు కనబడుతున్నావు.

గాలి కదలదు. ఆశ వదలదు. మబ్బులు ఆకాశం అంచులకంటే జరిగి అక్కడే ఆగిపోతాయి, నువ్వు

కనబడగానే. అచేతనావస్థలో నిలబడి; నీ కోసం సంవత్సరాలు ముదరకపోయినా, నిమిషాలలో వయోవృద్ధుణ్ణిగా- అంత జాగ్రత్తగా కాలం ఖర్చు చేస్తాను.

మువ్వు రావు.

రమ్మనవు.

అప్పుడు వెళ్ళిపోతూ కనుపించావు.

"ఎక్కడికి" అన్నాను.

"నీ కోసం దూరంగా వెళుతున్నాను."

"నా కోసం, నాకు దూరంగా!"

"అవును. నువ్వు నన్ను చూస్తూ కూర్చుంటే మనిషిగా బ్రతకలేవు."

"నిజంగా అంతేకావచ్చు. వక్కసారి మనసారా చూడనియ్యి. నీ చుట్టూ ప్రణయసౌరభంతో పేరుకుపోయిన ఆ గాలిని నన్ను పెనవేసుకు పోనియ్. ఏ దూరం వెళుతున్నావో చెప్పు. ఆ దూరం వైపు చూస్తూ కాలం గడుపుతాను."

"మళ్ళా అదే పిచ్చి" అని యేడుస్తూ వెళ్ళిపోయావు. నీపై గల అవ్యాజానురాగం పిచ్చి అయినా సరే, దానిలో నేనెంతో ఆనందం పొందుతున్నాను. నన్ను నేను తగలబెట్టేసుకుని, నీ కోసం నీలాగ తయారై పోతున్నాను. ప్రత్యూషం నా జీవితంలో ఆ పిచ్చే అయితే - దానిలోనే ఆనందం నాకు. పిచ్చివాడెంత స్వేచ్ఛాజీవి!

వెళ్ళిపోయావు.

వెళుతూ వెళుతూ, రెండు కన్నీళ్ళు కార్చావు.

ప్రక్క నున్న నదిలో జ్వలిస్తున్న ఆకాశం.

మరపురాని చుక్కల్లాగ, నీ కన్నీటి చుక్కలు.

"రావా ?"

"రాను" అంటావు.

"నువ్వు రాను" అనగానే దాంట్లో కూడా, 'వస్తాను వేగిరం' అనే ఆవేదనా, ఆశా, ఆనందం, అందం - అన్నీ కలిసి కనబడతాయి నాకు. ప్రకృతి కూడా నవ్వింది ఆశగా ఆ మాట విని. ఆనందం నాపై ఆకాశంలాగ గూడు అల్లింది. ఆ ఆశతోనే బ్రతుకుతున్నాను. వస్తావో వస్తావో; ఇక్కడ్నీ నీ కోసం తపోనిష్ఠలో కాలం ఖర్చుపెట్టి కన్నీరు కొనుక్కోమంటావో ?

నన్నేమైనా చెయ్యగలవు. నిన్నేమీ కోరను నేను.

నీ ప్రణయ వల్లరిలో పువ్వునై పూసి, నీ పాదాల ప్రోల జీవిత మధువునంతా పిండి, పోసి, నిన్ను నేను పెంచుకుంటూ, నన్ను నేను బ్రతికించుకొంటున్నానని వీళ్ళందరికీ తెలుసు. నిన్నూ, నన్నూ విడదీసి, దూరంచేసి, ఘోరమైన చూపులతో నిన్ను నాకోసం, నన్ను నీకోసం, కాలం కొమ్మలు విరిచి, బాధల చిక్కులు విడదీసి, సమాగాల పూలు యేరుకుని, ప్రేమ ఫలాలు వెతుక్కోమన్నారు.

నిన్ను దూరతీరానికి విసిరేసిం దే క్రూరహస్తం? పరాతుసి నిన్ను సముద్ర గర్భంలో నాకు దొరకని ముత్యంగా విసిరేసింది ప్రేయసీ!

పగిలిపోయిన హృదయవీణ చేతులతో అదిమి పట్టి, ఎంతకాలం జీవగానం వినరగలను కాలంలోకి ?

క్షణాలు కాలంలో ప్రణాలు వేస్తున్నాయి. ప్రణయవుగాలం ఆశలమచ్చు పెట్టి హృదయంలో గుచ్చుకుంటుంది.

ఆకాశం అరుణోదయంకోసం లేచి కళ్ళు నలుపుకుంది. ఆ కళ్ళలో కరిగిపోయిన స్వప్నాలలో నేను అరిగిపోయి, నా అని చెప్పుకోటానికి లేని ఒక్క కిరణంగా మిగిలిపోతే—"ధన్యోస్మి" అనుకొనే వాడిని—నువ్వే ఆ అరుణోదయం—నేనే ఆకిరణం.

కాని, అంతవరకూ పగిలిపోయి కూర్చోవటం చేతకాదు. పగిలిపోయిన వీణ అపశ్రుతులు ఆలపిస్తుంది. అయినా యెంత కాలమో—అదీ నీ చేతిలోనే వుంది.

నువ్వు నేడు అందవు. అందినా, మునిమాపుల్లో సూర్యుడు చీకటి గుప్పిట్లో విడిచిన అరుణిమలాగ జాచుట్టూ నీ స్మృతులు నింపి, నన్ను నీహృదయపాత్రంలోకి వంచుకు వెళ్ళిపోతావు.

నిన్ను చూడని రోజులుకాదు, క్షణాలెలాగ గడపను?

"వాతో మాట్లాడవద్దు" అన్నావు.

"సరే"

"నావంక చూడవద్దు" అన్నావు.

"అదీ సరే!"

ఆ అందం ప్రకృతి అంచుల్లో అలాగే అరిగిపోవాలిగాని, మనిషి చేతుల్లో—కనీసం కళ్ళలో కూడా నలిగి, ఆరిపోవటానికి వీల్లేదు. అందుకే, "అదీ సరే"

"నన్ను గురించి వినవద్దు" అన్నావు.

అమాటే అనవద్దు. ఎలాగ వినకుండా బ్రతకటం? అప్పుడు నీ పెదవులు నిప్పుల్లాగ మండాయి. ఎందుకంత తీక్ష్ణత? అమాటే సహించలేను. ఈ పగిలిపోయిన వీణనికూడా నీగురించి విని, నీకోసం, అశోకవృక్షంనీడలో నిలబడ్డ సీతమ్మలాగ, ఆశాకిరణాల క్రింద కూలిపోయిన యీ వీణని విషాదగీతికలు పాడనియ్యి, నీ గురించి పాడుతూ ధ్వంసమైపోనియ్. నీ గురించి లోకాన్ని విడిచినప్పుడైనా నువ్వూ నేనూ నిత్యం వీళ్ళ పెదవులపై కలుసుకునే అవకాశం కలుగుతుందేమో! అంతేచాలు. అందుకే విననియ్యి.

మబ్బూమబ్బూ కలుసుకున్న మరుక్షణం రాలిన మెరుపు నువ్వు. నీ మనసు విడిచిన నిట్టూర్పుగా బ్రతికినా, నీ చెవులకు సోకిన శబ్దంగా బ్రతికినా చాలు. అందుకే నిన్నుకోరే శక్తి నాకు దక్కింది. ఏదీ కోరకుండా భస్మమై పోగలిగినప్పుడైనా లభ్యంకాలగవు నువ్వు. అంతవరకైనా విననియ్యి కనీసం.

దూరంగా వెళ్ళిపోయావు. నేరంచేసినట్టు నావైపు చూస్తున్నావు. భారంగా నడుస్తూ, మేఘాలు మేసి, దూరాలు కోసి, సాయం సంధ్యలో అందమంతా త్రాగి మాయమైపోయిన సూర్యుడిలాగ, ఆ దూరతీరంలో నీకూ నాకూ అశల మంచుపొర అల్లి ఆగిపోయావు.

నిన్ను చూడాలని బాధ
ఆ బాధే బ్రతికిస్తుంది
ఆ బాధే ఆడిస్తుంది
ఆ బాధే పాడిస్తుంది.

"రావా?" అన్నాను కడసారి నిన్ను సాగనంపుతూ. భయంగా, లోకంవిధించిన శిక్ష శిరసావహించి కడసారి చూపుకోసం వెయ్యి దేవతలకు మొక్కి వచ్చావు.

"రావా?" అన్నాను

"రాను" అన్నావు.

విననిచ్చినందుకేగా బ్రతికున్నాను.

లేకపోతే యేగాలికో తేలి, యేనదిలోనో తూలి, ఇసుకపొరలపై వాలి, భూమిలోజేరి, అజ్ఞాతంగా అంధకారంలో కూరుకుపోయేదేగా నీ హృదయవీణ! అక్కడొక ముక్క—ఆ గాలిలో ఒకతీగ—ఆ సముద్రగర్భంలో ఒక శకలం—కలిసిపోయి, ఆ సాగర తరంగ డోలికలపై తేలుచున్న వీచికల హోరులో కలిసిపోతే – నా జీవగానం – నువ్వేమయ్యే దానివి? ఎక్కడో వకదిక్కున కూలిపోతే, రోదనామంత్రాలు పఠించి, నీ కన్నీరు ఆజ్యంగా పోసి, ఆ హోమగుండంనుండి నన్ను పుట్టించి నీచూపుల ప్రతిధ్వనులు నాలో పూయించవచ్చు. అందుకే సఖి! కనీసం విననియ్.

అలాగ ఆకాశాని కెగిరిపోయినా నన్ను నువ్వు చూస్తూ కాలం గడపొచ్చు. ఇలాగ ఛిన్నాభిన్నమైపోతే యెక్కడ నన్ను వెదుకుతావు?

గ్రీష్మంలాగ ఉక్కిరిబిక్కిరిచేసి వచ్చావు.
వసంతంలాగ నిండుగా, నీరసంగావెళ్లావు.
ఉషః సమీరంలాగ వచ్చావు. తీగలా సాగావు.
నిశీథి సమాధిలో నిశ్శబ్దంలాగ వెళ్లావు.

నే నెలాగ సహించను, కడపటి చూపులలో తేలిపోయిన అనురాగపు ఆవేదన? నువ్వెలాగున్నావో నని భయం నెమరేస్తూ కాలంగడుపుతున్నాను.

హృదయ వీణ పగిలిపోతున్న సమయంలో పాడాను. వచ్చావు. వచ్చి, హృదయ వీణ అతికి, ఆరకుండానే వెళ్ళిపోయావు.

"నే నెందుకు బ్రతుకుతున్నానో తెలుసా ?"

"తెలియదు."

"ఎందుకు తెలియదు నీకు ?"

"నా కన్నీరు నన్నే కార్చుకోనివ్వండి. వాటిలో మీకు భాగం వద్దు" అని రెండవసారి కలుసుకున్నప్పుడు అన్నావు. నే నొక వెచ్చని-పచ్చని బ్రతుకు కోరాను. ఆరాటపడ్డాను. వారాలు బెగ్గురులాగ తపసుచేశాను.

హృదయ వీణ యథావిధిగా పగిలిపోయింది.

నిరాశల సుడిగాలిలో బ్రతుకు దీపాన్ని, బాధల చమురుపోసి వెలిగించాను. కనీసం నీ గురించి విననియ్యి. ఏ దూర తీరంలో వున్నా, నీకూ నాకూ మధ్య రక్తస్పర్శ—రక్తంలో పరిమళించే వాతావరణం అదెప్పుడూ తెగిపోదు.

జీవితం కాదు నేను కోరుకొనేది.

జీవించటానికి శక్తి నే నేరుకొనేది.

నువ్వు వెళ్ళేటప్పుడు కార్చిన కన్నీరే నన్ను వేధిస్తూంది ప్రేయసీ !

౨

ప్రియా !

వయోవసంతంలో యీ క్రొమ్మావి క్రొమ్మపై వాలిన గండు కోకిలా ! ఎలాగున్నా వక్కడ ? ఏం చేస్తున్నావు ? చెట్ల కొమ్మల్ని తప్పించుకుని, గన్నేరు గుబుర్లు దాటి వస్తున్నాడా చంద్రుడు అప్పటిలాగ ? లోకం దుప్పటిముసుగు తొలగిస్తున్నాడా ??

నువ్వు వచ్చావు గన్నేరుపొదదగ్గరికి. నేను రైలుపట్టాలు దాటివచ్చాను. అదే ప్రథమం. గాలిలో పరిమళం జేరి నిండిపోయింది. శరీరం ఆనందంతో నిండిపోయింది. నేను మాట్లాడలేదు. నీ చేతుల్లోకి ఎగిరివచ్చాను. నీ ముఖంలోకి చూడలేక, చూడలేక చూచి ఆనందంలో తన్మయత పొందాను.

అదే ఆఖరు రాత్రి మాత్రం కాకూడదని కోరుకున్నాను.

ఎలాగన్నానో మూడుసార్లు కలుసుకున్నప్పుడూ, "నేను రాను" అన్నాను. ఎందుకన్నాను. ఎవరనిపించారు ? ఏమో.

అన్నానే గాని నువ్వన్న అర్థమే యథార్థం. అదే ప్రేమికుల భాష. అందరికీ ఎలాగ అర్థం కాగలదది ? చంద్రుడు తాడిచెట్టుకూడా దాటి మేఘాల మధ్య చిక్కడిపోయాడు. ప్రథమ దర్శనంలో కంఠం మూగవోయి, శరీరం శక్తిని గోల్పోయి. రక్తం చల్లబడిపోయింది. నిజమైన ప్రేమ దేన్నీ చూడక, వినక, కోరక, చెయ్యక పోయేదే అయితే మనిషి నిజంగా దానికోసం భస్మమైపోవటం ఎంత గొప్ప !

నీ హృదయం విప్పి నా కుప్పిట్లో పెట్టి ఎలాగ చదువుకోమన్నావు ? నా హృదయంలోని విద్యనంతా నువ్వెప్పుడు దొంగిలించావు దొంగా !

నువ్వు ఆసుపత్రిలో రెండవసారి ప్రేమరోగిగా దర్శనమిచ్చావు. నీ కళ్ళలో నా చూపులతో యింజెక్షన్ చేసి, నీ నరాలలో నా రక్తం వేడిని వంచి, నిన్ను నేను బ్రతికించుకున్నాను. నేనే నర్సుని. డాక్టర్ని. యాక్టర్ని. ప్రేమ లోడ్ చేసుకు వచ్చిన ట్రాక్టర్ ని.

"డాక్టర్ !" అన్నావు.

"ఏం కావాలి నీకు ?" అన్నాను నీ ప్రక్కమీద కూర్చుని.

"నువ్వే కావాలి నాకు. నా కీ లోకంవద్దు యీ లోషన్ కంపూ, లోకంకంపూ లేని మరో లోకానికి నన్ను జేర్చు డాక్టర్" అని నా కళ్ళలోకి నవ్వుతూ, సంతృప్తిగా చూశావుకదూ ?

"ఇష్ ! గొడవపెట్టకు. మరీసిల్లీ బేబీ !' అన్నాను నీకపోలంపై నా చెయ్యివుంచి, కొనవేళ్లతో నుదురు సవరిస్తూ.

చుట్టూ విద్యుద్దీపాలు వెలిగిపోతున్నాయి.

నీకు సర్వాంగసుందరిసైన నైట్ సర్వెంటుని.

ఆ రాత్రి నిడదవోలు ప్లాట్‌ఫారం మూలకి వెళ్ళి కబుర్లు చెప్పుకొన్నాం. మళ్ళా నువ్వు నన్ను రమ్మన్నావు.

ఏం చెప్పాను మీకు. తిరిగి అదే పాడుమాట అన్నాను.

మూడుసార్లు—

"రాను. రాను. రాను !!!"

"ఒంటరి జీవిత మెలాగ గడపను? ఏం చెయ్యా నీ జీవిత శేషం ?" అన్నావు దిగులుగా. అప్పుడు మీ కాళ్ళక్రింద భూమి కరిగిపోతున్నట్టుందను కొంటాను.

ఏడుస్తూ వెళ్ళిపోయాను. మూడు రోజులు మంచంపట్టాను. ఎవరికి తెలుసు నా బాధ ? ఎలాగ తెలియజెయ్యను? రాత్రి వెయ్యి నాలుకలతో నాపైకి దాడిచేస్తుంది. గాలి నన్ను నీలాగ స్పృశించి, వెక్కిరించి, చక్కిలిగింతలు పెట్టి నవ్వులపాలు చేసింది. కలవరించాను. మన జీవిత మే కలవరింతల పాలై పోయింది.

నర్సులంతా హేళనచేశారు.

మిస్ వచ్చి "రేపటినుంచి, నన్స్ కాంపౌండ్ దాట రాదు అమ్మాయీ" అన్నది. చెరకు గెడనుండి రసం ఓడ్చుకుపోయినట్టు, జీవశక్తి హరించిపోయింది అప్పుడే. జీవితంలోని ముఖ్యభాగానికి దూరమై పోయాను. ఏం చెయ్యను ? వైధవ్యం ప్రాప్తించిన ఇరవై సంవత్సరాల పడుచులాగ......

ప్రకృతి, గాలి, చుక్కలు, మేఘాలు, సర్వం నన్నుచూచి వెక్కిరించాయి. ఆకాశం రాలి మీద పడ్డ ట్టనిపించింది.

వెన్నెల!

రైలు రోడ్డుకు దూరంగా గోదావరి !

నదిలో నువ్వూ నేనూ...ఎక్కడ? ఎలాగ? ఏం చెయ్యను ?

ఆ రాత్రి ఆకోలముఖం నల్లపిల్ల, — సన్నగా పొడుగ్గా - నవ్వుతూ అందంగా నర్సు. ఎంతమంచి పిల్ల? నేడు మీ కీమాత్రం బ్రతికే అవకాశం కలిగిస్తే ఆ పిల్లే. ఆ నవ్వులో, ఆ కన్నుల్లో భగ్నప్రేమికుల ప్రతిమలున్నాయి చూశారా? ఆ నుదిటి రేఖలు వక్రించి జీవితాన్ని అఘాతంలోకి తోసేసాయి కనిపెట్టారా?

వచ్చి మీతో ఆ పిల్ల దయని కాపలాగా పెట్టు కొని నడిచాను నదివరకూ. మీ శరీరం చుట్టూ నా చూపులకోట కట్టాను. మంత్రగత్తెనే అయితే ప్రహారిదాటి, నన్నునుండి విడువడి యెందుకు రాలేను? నా కిప్పుడేశక్తి లేదు. నేనొక మృతాత్మను.

"వస్తావా రేపు ?" అన్నారు ఆశగా.

మీరే చెప్పండి సమాధానం.

"రాను"

"ఎందుకు ?"

"మీకోసం"

"నా కోసం నాకు దూరంగా! అదే నన్ను కోత పెడుతుంది." ఏడుస్తూ వెళ్ళిపోయాను.

నేను గోడలమధ్య పువ్వులమధ్య అంధకారం గుప్పిట్లోపడి, అసహాయంగా నిరాశమధ్య— నిజంగా యిది మరోతీరం.

మీకు నాకూమధ్య లేఖలువద్దు.

నన్ను గురించి వినవద్దు సఖా!

ఎవరైనా 'నన్' చనిపోతే మీ రెవరనుకుంటారు? ఎందుకలాగ బాధపడటం? నేనెప్పుడో చచ్చి పోయాను. తెల్లని దుస్తులధరించి, కళ్ళకీ నా యింద్రియాలకూ కంతలు కట్టుకొని, భూతంలాగ మిగిలా నీ గోడలమధ్య !

సుదూరతీరంలో నాపై ఆశలు వద్దు.

రానుసఖా !

రాలేను సఖా !!.

సి. నారాయణరెడ్డి | లోవెల్గులు

ఈ వెల్గులు త్రపాఘుసృణహిండితములు ; ఈ వెల్గులు
దరస్మేరకపోలచంద్రకితమ్ములు ; చకితమ్ములు.

ఇవి కజ్జలముగ్ధపక్ష్మ వివృతరాగభాష్యమ్ములు
గూళ్ళెరుగని సింగిణి రంగుల పుల్గులు ఈ వెల్గులు.

చంచలరజనీరమణీ చరణకింకిణీకృతములు
ఎంత కనులు మూసికొన్న అంతగ కన్పడు వెల్గులు.

సద్యోవికచదవాగ్నిజ్వాలాదళబాంధవములు
మండినంతసేపు గంధమాధురు లిచ్చెడి వెల్గులు.

మస్తకవిన్యస్తహస్తమర్యాదుని అంటుకొన్న
కంటితుదలదాక వచ్చి వెంటనే అదృశ్యములగు.

చింతాదంతురిత మనస్విముని కుంటియూహలకు
త్రుటికాలము తటిల్లతలతో వియ్యము జరిపించును.

ఇంటిని ఒంటిని మరచిన ఇనుపకచ్ఛదముల వారి
కే కొంతకు కొంత కానుపించి వెఱ్ఱియెత్తించును.

ఇట్టి కొంటెవెల్గులు సంధృతబహురూపమ్ములు నా
కెట్టుల —ఈ గాజుకనుల కెట్టుల— గోచరమయ్యెను.

శబలితగాఢచ్ఛవి ప్రసన్నములు రసస్విన్నము
లీ వెల్గులు కాబోలును లోవెల్గులు— ఏమోమరి !

లోవెల్గులు చూడగల్గు జీవులెవ్వరీ కాలము ?
ఔనో లోవెల్గుల ఛాయాక ప్రతిబింబము లివి.

## జోహాన్ పీటర్ హెబెల్★ | కానిట్ వర్‌స్టన్

జీవితం పూలసెజ్జలాంటిది కాకపోయినా తన కున్నంతలో తృప్తిపడటం నేర్చుకోటానికీ, సమస్త లౌకిక వస్తువుల అశాశ్వతత్వాన్ని గురించి ఆలోచించటానికీ —ఎవరైనా ఆలోచించదలచుకుంటే— ఎమెండింగెన్, గుండెల్‌పింగెన్ పట్టణాలలోవలెనే ఆమ్‌స్టర్‌డామ్ పట్టణంలోకూడా ప్రతిదినం చాలా అవకాశాలు కల్గుతాయని నేను ఘంటాపథంగా చెప్పగలను. కాని మన కథానాయకుడైన జర్మన్ ప్రయాణీకుడు చాలా విచిత్ర పద్ధతిలో ఈ సత్యాన్ని తెలుసుకోగలిగాడు.

బొబ్బలు పెడుతున్న ఓడలతో, అందమైన సౌధాలతో, నిరంతరకార్యనిమగ్నతవల్ల కిటకిటలాడుతున్న జనంతో ప్రేక్షణీయంగా ఉన్న ఆమ్‌స్టర్‌డామ్ నగరంలో ప్రవేశించిన తరువాత తన ప్రయాణాలన్నిటిలో ఎన్నడూ చూడనంతటి ఎత్తైన, అందమైన సౌధం ఒకటి అతనికంట పడ్డది. అతడు చాల సేపటివరకు ఆ మహా సౌధంవైపు రెప్పవాల్చకుండా చూస్తూ నిలుచున్నాడు. ఇంటి కప్పుపై ఆరు చిమ్నీలు, చూరువద్ద గోడలపై మలచబడిన నగిషీలు, తనతండ్రి ఇంటి తలుపులకంటె కూడా ఎత్తైన, పెద్దవైన కిటికీలు,-వీటన్నిటినీ చూస్తూ నిలుచున్నాడు.

ఆఖరుకు ఔత్సుక్యం పట్టలేక ఒక పథికుని అడిగాడు- 'ఇంత పెద్ద ఇంటికి యజమానియైన మహానుభావుని పేరేమిటో చెప్పగలరా' అని. ఆ మనిషి బహుశః ఏదో ముఖ్యమైన పనితొందర్లో ఉన్నాడు. మన ప్రయాణీకుని కెంత డచ్ భాష తెలుసునో ఆ పథికునికీ జర్మన్ భాష అంతే తెలుసు. ఆయన 'కానిట్ వర్‌స్టన్' అని మూడు ముక్కలు గొణిగి తనదారిన తాను పోయాడు.

మన ప్రయాణీకుడు పాపం అది ఆ ఇంటి యజమాని పేరనుకొన్నాడు. మిస్టర్ కానిట్ వర్‌స్టన్ పెద్ద ధనవంతుడై ఉంటాడు అనుకొన్నాడు.

జర్మన్ ప్రయాణీకుడు పట్టణం చూస్తూచూస్తూ ఓడరేవు దగ్గరకు వచ్చాడు. అక్కడ ఎన్నో ఓడలు నిలబడి ఉన్నవి. తన రెండు కళ్ళతో ఇన్ని ఆశ్చర్యాలెలా చూడగలుగుతున్నానా అని ప్రయాణీకుడు విస్తుపోతున్నాడు. రేవులో అప్పుడే ఈస్టిండీస్‌నుండి వచ్చిన ఒక పెద్ద ఓడ నిలబడి ఉంది. అది రకరకాల సరుకులతో నిండి ఉన్నది. ఆ సరుకులన్నీ అప్పుడే దించుతున్నారు. చక్కెర, కాఫీ, బియ్యం, మిరియాలు వీటితో నిండిన గాదెలు లెక్కలేనన్ని ఓడమీద ఉన్నవి.

చాలా సేపు వాటివైపు చూచిన తరువాత ఓడలోంచి సరుకులు మోసుకొస్తున్న ఒకణ్ణిచూచి అడిగాడు- 'ఏ అదృష్టశాలి కోసం ఈ ఓడ ఇన్ని వస్తువులను మోసుకవచ్చిం'దని. 'కానిట్ వర్‌స్టన్' అన్న మూడు ముక్కలే మళ్ళీ జవాబు.

అప్పుడత డనుకొన్నాడు. 'అదా సంగతి! సముద్రంమీద పడి అన్ని వస్తువులు ఆయనకోసం వస్తే ఆయన అంత పెద్ద ఇల్లు కట్టుకోటంలో ఆశ్చర్యమేముం'దని. అలాగే అనుకుంటూ లోకంలోని అనేక భాగ్యవంతులను తలచుకొంటూ, తన దారిద్ర్యాన్ని గురించి విషాదపడుతూ అతడు

---

★ జోహాన్ పీటర్ హెబెల్ (1760-1826) జర్మన్ రచయిత. మతాన్నిగురించి అధ్యయనం చేసి స్కూల్ ఉపాధ్యాయుడుగా పని చేసినారు. ఆయన కథానిక లాయనకు ప్రశస్తిని సంపాదించినవి.

నడుస్తున్నాడు. సరిగ్గా 'నేనుకూడా కానిట్ వర్ స్టన్ లాగా గొప్ప భాగ్యవంతుడనైతే బాగుండును' అనుకొంటునప్పుడే అతడొక మలుపు తిరిగాడు. మలుపు తిరగగానే అతనికి కంటబడిన దృశ్యమిది. వీపుమీదనుంచి నల్లని బట్టలు వ్రేలాడుతూన్న నాలుగు గుఱ్ఱాలు మెల్లగా ఒక బండిని లాగుతున్నవి. బండిలో మనుష్య శవమున్నది. బండి వెనుక జంటలుజంటలుగా నల్లని బట్టలు తొడుక్కొని మరణించినవాని మిత్రులు, బంధువులు అనేకులు నడుస్తున్నారు. దూరంగా ఒక గంట మ్రోగుతున్నది. ఇలాంటి దృశ్యం చూచినపుడు సజ్జనులకందరికి కలిగే దుఃఖ భావమే మన ప్రయాణీకునికీ కలిగింది. అతడు నెత్తిమీద నుంచి హేటు తొలగించి, సాదరంగా నిలబడ్డాడు. తుదకు చిట్టచివరన నడిచేవాన్ని మందలించి, క్షమాపణ వేడుకొని అడిగాడు 'ఆ చచ్చినవా రెవ' రని.

'కానిట్ వర్ స్టన్' అని జవాబు.

రెండు పెద్ద అశ్రుబిందువులు ప్రయాణీకుని కండ్లలో నుంచి జారిపడినవి. అతనికి దుఃఖం కలిగింది. బరువుదిగిపోయినట్లుకూడా అనిపించింది. పాపం! అంతభాగ్యంలో ఇప్పుడు కానిట్ వర్ స్టన్‌కు ఏమి మిగిలింది? చచ్చినతరువాత దరిద్రుడనైన నాకు లభించే అంత గుడ్డముక్కే అంతటివాడైన కానిట్ వర్ స్టన్‌కు మిగిలింది' అని అనుకుంటూ చచ్చినవాడు తన సంబంధీకుడన్నట్లు ఆయన శవం వెంట నడచాడు. కానిట్ వర్ స్టన్ భూమిలోపల తన చరమ స్థానానికి వెళ్ళిపోతూండగా చూచాడు.

ఇతరులతోపాటు ఆయనకూడా శ్మశానంలో నుంచి బయటికి వచ్చాడు. హృదయం తేలిక పడ్డట్టనిపించింది. ఏ హోటల్లో జర్మనుభాష తెలుస్తుందో అల్లాంటి ఒక హోటలు వెతుక్కొని ఇష్టంగా తిన్నాడు.

తరువాత ఎప్పుడైనా లోకంలోని భాగ్యవంతులనూ తన దారిద్ర్యాన్నీ తలచుకొని హృదయం బరువెక్కితే ఆయన కానిట్ వర్ స్టన్‌ను, ఆయన విశాల సౌధాన్ని, ఆయన పెద్ద ఓడనూ, ఆయన చిన్న గోరీని తలచుకొనేవాడు.

ఇంతకూ 'కానిట్ వర్ స్టన్' అన్నది మూడు డచ్ పదాల కలయిక అనీ, ఆ పదాల అర్థం 'మీరేమంటున్నారో నాకు తెలియటంలేదు' అనిన్నీ అతనికి తెలియదు.

(కొద్ది మార్పులతో అనుసరణ—సిద్ధార్థ)

# చర్చావేదిక

రాంషా

జయంతి రెండవ సంచికలో కేతవరపు రామకోటిశాస్త్రి గారి "విమర్శకులు - విమర్శనము" అన్న వ్యాసం ఎన్నో ఆలోచనీయాంశాలతో నిండివుంది. అందులో కొన్ని వివాదగ్రస్తాలు. మరికొన్ని నా మటుకు అంగీకారయోగ్యాలే. మరి కొన్ని అంశాలు మార్పులకి చేర్పులకి అవకాశమిస్తున్నాయి. ఏమయినా విమర్శాసాహిత్యం మీద వీరు ప్రారంభించిన ఉద్యమాన్ని చూచి ఆనందించాను. ఎన్నాళ్ళనుంచో అలా వుండిపోయిన లోపం ఇప్పుడు పూర్తవుతూంది గదా అని ! ప్రస్తుత విషయంలోకి వస్తాను.

ప్రారంభిస్తూనే వారు "సాహిత్య విమర్శకులని అనుకొన బడు వారందరూ అసలు విమర్శకులు కారు ; మూడు వంతులకు పైగా ప్రచారకులు ; మిగిలిన ఆ ఒక వంతులో క్షత విమర్శకులు (imperfect) అక్షత విమర్శకులని (perfect) ఇరుతెగలవారు కలరు" అన్నారు.

ఇది నాకు సరిపడలేదు. 'ప్రచారకులు' (propagandists) అనే శబ్దం యిక్కడ వాడటం మంచిదికాదు. కళ కానిది ప్రచారమనే భావం ఒకటి సాహిత్యకులలో వున్నది. విమర్శను కళగా చెప్పలేము గనుక విమర్శకులు ప్రచారకులవటం తప్పు కాదు. అసలు విమర్శనా వ్యాపారమే ప్రచారం; అది గ్రంథకర్త భావాల గురించి కావచ్చు ; లేదా విమర్శకుని తూకపురాళ్ళయిన లక్షణ విషయాలు కావచ్చు. తమ తమ భావాలను ప్రచురించుకోవాలనే ఉబలాటం ఉన్న వారందరూ ప్రచారకులే అవుతున్నారు. కనుక కొంత మంది విమర్శకులను 'ప్రచారకు' లని పేరుపెట్టి వారికి వేరే స్థానం కల్పించటం సమంజసంగా తోచటం లేదు.

మరొక్క విషయం కూడా వున్నది. "విమర్శకు" లని పిలువబడుతున్న వాళ్ళంతా మనకు ప్రాచీనులు కాదు. బొత్తిగా ఇటీవలి మనుష్యులే. మనకు పూర్వులందరూ 'లాక్షణికులే' కాని 'విమర్శకులు' కారు. భరతుడు, మమ్మటుడు, దండి మొదలైన వారంతా అంతే. వీ రెవ్వరూ వారి కున్న లక్షణ జ్ఞానంతో మహాకవుల గ్రంథాలను 'విమర్శించి'నట్లు ఆధారా లేమీ లేవు. కనుక శాస్త్రిగారి విమర్శకులలో వీరికి స్థానం లేదు.

అయితే 'విమర్శకు' లెవరు ?

ఇంగ్లీషు సాహిత్యప్రభావంవల్ల మనతెలుగులో నవలలు, చరిత్రలు, ఆత్మ కథలు ఎలా వచ్చాయో విమర్శలు కూడా అలాగే వచ్చాయి. విమర్శ అనే శబ్దం ఇంగ్లీషులో criticism అన్న మాటకి సమానార్థకంగా వాడబడుతున్నది. అలాగే విమర్శకులు critics కి.

మరో చోద్యం కూడా ఉంది. మనకు ప్రాచీనకాలంలో విమర్శకులు లేనట్లే యింగ్లీషువాళ్లకి 'లాక్షణికులు' లేరు.

లాక్షణికులందరిదీ Abstract Poetics ; వారికి లక్షణమే లక్ష్యము ; అంతేగాని ఏకవికృతకావ్యమూ కాదు. విమర్శకులకు అట్లాకాదు. లక్షణం వీరికి ప్రమాణం. కావ్యంవీరికి లక్ష్యం. కనుకనే విమర్శనని Applied Poetics అని చెప్పుకో వచ్చును.

"రచయిత తీసుకున్న వస్తువును, అతని వ్యంజనపద్ధతినీ వ్యాఖ్యానించటమే విమర్శకుని పని" అంటాడు హడ్సన్. విమర్శ అనగా విడమరచి చూపడమో, చూడటమో అవుతున్నది. అంతకుమించి దీనికి విలువనివ్వటంవల్ల శ్రీ శాస్త్రి గారి వ్యాసం మరికొన్ని దృష్టిదోషాలకు ఆస్పదమయింది.

దానికి తగ్గట్టు ఆయనకు దొరికినమాటలుకూడా అలాంటివే ; ప్రచారకులు ; Perfect (అక్షత) Imperfect (క్షత) విమర్శకులు-అన్నదగ్గర బయలుదేరి, విమర్శకుదొరకొంటే ఎంతటి శంభారావమైనా అరణ్యరోదనమే అవుతున్నది.

ఒక భావదరిద్రుణ్ణి తీసుకుని, భావసంపన్నుడి పక్క నిలబెట్టి, వాడితో వీణ్ణి పోల్చి - వీణ్ణీ, వీడి దరిద్రాన్నీ చావగొట్టటం శాస్త్రిగారివంటివారు చేయకూడదట. ఇలా పేర్లుపెట్టి వాటికి నిర్వచనాలిచ్చి, చేతనైనన్ని శాపనార్థాలు పెట్టటం కూడా వారి విమర్శ క్షమించదు.

నిజంగా ఆయన ఇద్దరు 'అక్షత' విమర్శకులు ఒకే గ్రంథంపై ఎందుచేత పరస్పర విరుద్ధాభిప్రాయా లిస్తున్నారు? అన్న ప్రశ్న నెక్కడా ఆలోచించలేదు. అలా ఆలోచించి ఉన్నట్లయితే ఈ వ్యాసస్వరూపమే పూర్తిగా మారిపోయేది.

మరొకటికూడా ఆయన చూడలేదు ; 'విమర్శ'కు లన్న శీర్షికక్రిందికి ఎవరెవరిని తేవచ్చును ? అన్నది. మూలతత్త్వశోధనమే దృష్టిలో వుంచుకున్నవారు కావచ్చు; లేదా వ్యాఖ్యానించేవారు కావచ్చు ; లేదా మూలనిర్ణాయకులు కావచ్చు ; లేదా ఈ పనులన్నీ కలిపిచేసేవారు కావచ్చు - ఎవరైనా సాహిత్యాన్ని *గురించి* వ్రాసేవారయితే చాలు - ఈ పేరుకు అర్హులౌతారు. అయినప్పుడు వారిని 'అసలు' విమర్శకులు కారనటం శాస్త్రిగారి తప్పే.

మరోతప్పు 'క్షత, అక్షత' శబ్దప్రయోగాలు. 'క్షత'మంటే గాయమని అర్థము : నఖక్షతాలు, దంతక్షతాలు, క్షతగాత్రులు వగైరా. కనుక Perfect కి అర్థం అక్షతమూ కాదు ; Imperfect కి అర్థం క్షతమూ కాదు. సంపూర్ణము Perfect; అసంపూర్ణము Imperfect అవుతున్నది. ఈ మాటలు వాడి వుంటే ఈ వ్యాసం యింత సంకుచితంగా నడిచేది కాదు.

ఏమంటే, సంపూర్ణులూ అసంపూర్ణులూ అన్ని రంగాలలోనూ ఉన్నారు. అసంపూర్ణుల్ని నిందించినంతమాత్రాన సంపూర్ణుల తేజస్సు బయట పడదు. అలా పడేటట్టయితే మన ప్రబంధ కవులు కుకవినిందకి ఒకటిరెండు పద్యాలను మాత్రమే అంకితం చేసి ఊరుకొనేవారై వుండరు కదా!

అశీత విమర్శకునికి శ్రీ శాస్త్రిగా రిచ్చిన నిర్వచనం ప్రకారం "ప్రక్రియా వైవిధ్యముతో కూడిన సాహిత్యము యొక్క అంతస్తత్వము నెరిగిన తెలివిగలవాడును; తాను కావ్య లక్షణము లనుకొన్నవానిని ప్రమాణములచేత సిద్ధాంతీకరించుకొన్నవాడును, లాక్షణిక మార్గము యొక్క అంతర్యము తెలిసినవాడును, స్వతంత్ర బుద్ధిమై స్పష్టమైన దర్శనము కలవాడునునై, ధర్మనిర్ణయాధికారమును సంపాదించుకొన్నవాడు" అవుతున్నాడు. ఇదేమంత గొప్పసంగతి కాదు. సామాన్య విమర్శకునికి ఉండవలసిన లక్షణాలే యివి. ఇవి ఉన్నవాడు విమర్శకుడు; లేనివాడు కాదు. దాని కింత రాద్ధాంతమూ, సిద్ధాంతమూ అవసరంలేదు.

కాని, ఉద్వేగంలో ఆయన కొన్ని దురుసుమాటలన్నారు. అయినవాళ్లనూ, కానివాళ్లనూ కలియగట్టి దుయ్యబట్టారు. మూలతత్త్వశోధనమే పనిగా పెట్టుకున్నవాళ్ళు 'ధర్మ నిర్ణయాధికారాన్ని' వహించరు. అయినంతలో అల్పులా? అలాగే వ్యాఖ్యానించేవారుకూడా. వీరిని శాస్త్రిగారు 'ప్రచారకు' లన్నారు. "వీరి యవసరములేదని చెప్పబోవుటలేదు. వీరి యవసరము దేశమునకు చాల యున్నది.... వీరి రచనలు, ఉపన్యాసములు అధిక సంఖ్యలో ఎన్ని వెలువడిన అంత మంచిది." మరి 'అంత మంచిదైన' దానిని శ్రీ శాస్త్రిగారే 'బజారు సాహిత్యోపన్యాసము'లనీ, 'దినపత్రికలలో వార్తల వలె వీరి రచన' లుండునసీ అనటం తంతవ్యమేనా?— ఈ తరహావారిలో కూడా సంపూర్ణులూ, అసంపూర్ణులూ వున్నారని గ్రహించకపోవటం శాస్త్రిగారి తప్పుకాదా? అది అలా వుంచండి. "అతని (ప్రచారకుని) ధోరణిలో ప్రధానముగా కనిపించునవి: గ్రంథములోని కథను తిరిగి తన మాటలలో చెప్పుచు, మధ్య మధ్య వీలైనన్ని పద్యముల నుదాహరించి వాని యర్థ తాత్పర్యములను విశదపరచుట. 2. సర్వజన విదితములైన లాక్షణికవు పడిగట్టురాళ్లతో జోడించి మచ్చు పద్యములని కొన్నింటిని చూపుట. 3. అస్పష్టములును-అనావశ్యకములును అయిన విశేషణములతో శైలి విషయమును స్పృశించుచు అందుకు కొన్ని పద్యము లుదాహరించి సహృదయులైన పాఠకశేఖరు లీ విషయమును ఎరుగగలరని చేతులు జోడించుకొని వినయము నభినయించుట— ఈరకమువారి రచనలు అతి సాధారణవు జనుల నుద్దేశించబడిన బజారు సాహిత్యోపన్యాసముల వలె నుండును" అన్నారు శాస్త్రిగారు. ఇట్టివారికి 'ప్రచారకు' డనే బిరుదు నివ్వటం వెకిలి వెధవకి విదూషకుడనే పేరు పెట్టి తిట్టడంలాంటిది. వెకిలివెధవ వెకిలివెధవే గాని విదూషకుడు కాడు. విదూషకుణ్ణి తిట్టటం నేను సహించను. విదూషకులు వ్యుత్పన్నులు; వారి మార్గంవేరు. గమ్యం ఒకటే. మార్గం వేరైనంత మాత్రాన లక్ష్యశుద్ధిగలవారిని తిట్టటం మతపిచ్చి లాంటిది. పైగా లక్ష్యంపై మనకే గౌరవ ప్రతిపత్తులు లేవని చెప్పక చెప్పుకోవటం. మరి వెకిలి వెధవల మాటో! వారి మాట మనకు దేనికి? వారెప్పుడూ వెకిలి వెధవలే! సూర్యుని తేజస్సులో మిణుగురుల కాంతిని వెదకటం సద్విమర్శకుని పనిగాదు. శ్రీ శాస్త్రిగారు యిట్టి అమాయకులు కాదు. లక్ష్యశుద్ధివారికి ప్రధానం మార్గంకాదు. కనుకనే ఆయన కూడా 'వీరి యవసరము దేశమునకు చాలయున్నది. వీరి రచనలు, ఉపన్యాసములు అధిక సంఖ్యలో ఎన్ని వెలు వడిన అంత మంచిది!' అన్నారు. ఎవరి రచనలు? పైన మూడు లక్షణాలతోనూ 'చేతులు జోడించుకుని, వినయాన్ని అభినయించేవారి' రచనలా? వారి రచనలే అయితే అవి దేశానికి ఉపద్రవాలు; అరిష్టాలు. వాటిని మొగ్గలోనే తునమటం మంచిది. శాస్త్రిగా రిలా నేను పట్టి గాంభీర్యాన్ని మాత్రమే ప్రదర్శించి, చివరికి చప్పబడిపోను.

మరి ఈ 'ప్రచారకు' లలో ఎవరి అవసరము దేశమున కున్నదయ్యా? అన్న ప్రశ్న వున్నది దీనిని మీరు అడిగా రనుకుందాం. వారిలాంటి వారు:

1. కావ్యములోని ఉక్తి చమత్కారములను, రస విశేషములను, ధ్వని విశిష్టతను, శబ్ద ప్రశస్తిని, శైలీ ప్రాశస్త్యాన్నీ నుగతమైన లక్షణ శాస్త్ర జ్ఞానంలో, పారిభాషిక పదాలను వాడకుండా సరళంగా, సరసంగా వ్యాఖ్యానించుట.

2. ఆవశ్యకమైన చోట్ల స్పష్టమైన భాషలో నిష్కర్షగా తన అభిప్రాయమును చెప్పుట.

3. సామాన్యపాఠకుడు గ్రహించలేని యథార్థ ఉదాత్త విషయములను ఎత్తిచూపించి, తనకు గల తార్కిక శక్తితో సమర్థించుకొనుట.

4. తాత్వికార్థాలను, సామాన్యమైన పద్ధతిలో విపులీకరించి పాఠకులకు జ్ఞానోదయము చేయుట.

సంపూర్ణ 'ప్రచారకులు' (వ్యాఖ్యాతలు) ఈ పని చెయ్య గలరు. అట్టి వారివి 'బజారు ఉపన్యాసాలు' కావు: 'దిన పత్రికలలోని వార్తలవలె' అవి వుండవు. అట్టి వారి "అవసరము దేశమునకు లేదని చెప్పబోవుట లేదు" అన్నమాట

నరిగాదు. అట్టివారి అవసరము మనదేశమునకు ఎక్కువగా మున్నదని చెప్పాలి. అట్టి వారికి జోహార్లివ్వాలి. అంతవరకూ శాస్త్రిగారితో నాకు పేచీ తప్పదు.

## క్షత, అక్షత, విమర్శకులు

ఈ శీర్షిక క్రింద శ్రీ శాస్త్రిగారిచ్చిన విమర్శకుల లక్షణాలు టొత్తిగా కలగా పులగమైపోయాయి. స్పష్టమైన అభిప్రాయాలు లేకపోవటమే దానికి కారణం. క్షత విమర్శకుని గూర్చి చెపుతూ: "అతడు కావ్య లక్షణములని కొన్నింటిని అనుకొనును, (supposes) వానికి హేతువు లుండనక్కరలేదు. అవి ఉన్నది మహాకావ్యము ; లేనిది కాదు." ఇంతవరకూ బాగానే ఉంది. కాని ఆ వెంటనే "*పరంపరగా వచ్చుచున్న లాక్షణిక మార్గ మాతనికి తెలియును*" అన్నారు. ఈ 'తెలియుట' ఏమిటి? ఈ 'తెలియుట' నిజమైన 'తెలియుటే' అయితే 'అనుకొనుట' ఏమిటి? 'అనుకొనుట' తెలియకపోవుటే నని శ్రీ శాస్త్రిగారికి తెలియదా? తెలియకనా? అందుకే శాస్త్రిగా రన్నారు: "ఆ మార్గము యొక్క అంతర్యము *తెలియ నక్కరలేదు*" అని. 'తెలియదు' అనలేదుగా: అనగా 'అంతర్యము' కూడ తెలియవచ్చునని ధ్వని. అలా తెలిస్తే ఈ ప్రారబ్ధమంతా దేనికి?

ఇక ఆ '*లాక్షణిక మార్గముయొక్క అంతర్యమును*' గురించి శాస్త్రిగారు కూడా ఎక్కడా చెప్పలేదు. నామటుకు నాకు లక్షణ మార్గము తెలుసును గాని దాని అంతర్యము తెలియదు. దానికి అనుస్యూతమైన అంతర్య మున్నదని ఏ లాక్షణికుడు కూడా నిర్దేశించలేదు. ప్రతీ లాక్షణికుడు తన అంతర్యమునే చెప్పుకున్నాడు. ఆ లాక్షణికులలో ఒకరి అంతర్యం మరొకరికి విరుద్ధంగా ఉన్న పట్లుకూడా తరుచుగా ఉన్నాయి. వాటికి పరిశీలించినకొద్దీ నాకు కొన్ని అభిప్రాయాలేర్పడి క్రమశః అవి నా అంతర్యంగా రూపొందాయి. లక్షణ మార్గంయొక్క అంతర్యాన్నిగురించి శాస్త్రిగారి అంతర్యం ఇది కాదనుకుంటున్నాను. అది అలా వుంచండి : "స్వతంత్రబుద్ధి లేనివాడు క్షత విమర్శకుడు" అని వెంటనే శాస్త్రిగారు తీర్మానించారు. ఇది మరో పెద్ద పొరపాటు. ఇది పొరపాటని ఎందు కంటున్నానంటే అక్షత విమర్శకునిగురించి చెపుతూ "స్వతంత్రబుద్ధియై, స్పష్టమయిన *దర్శన కలవాడు*" అని చెప్పి తప్పుకున్నారు గనుక. [స్వతంత్రబుద్ధి వేరు, స్పష్టమైన దర్శన వేరుకాదు. దర్శనకు లక్షణశాస్త్రంలో 'చూడట'మనే అర్థం లేదు. 'కనిపెట్టుట' (Discover) అనే అర్థం వుంది. అది ప్రతిభావంతునికే కూనువిద్య. లక్షణశాస్త్రం చదివినవారిలోనూ, చదవనివారిలోనూ, దానికో నిర్దిష్టమైన అంతర్యం వుందనుకున్నా అది తెలిసినవారిలోనూ, తెలియనివారిలోనూ స్వతంత్రబుద్ధులు చాలామంది వున్నారు. అట్టి అప్రయోజకుల మీదనే శాస్త్రిగారికోపంకూడా. ఎటొచ్చీ వారు స్వతంత్రబుద్ధి లేనివారనే అపోహ వీరికి:

ముందే చెప్పానుగదా: Perfect, Imperfect అనే విభజనచేసి బయలుదేరటంలోనే యిన్ని ముప్పతిప్పలూ వచ్చాయని; తీరా ఆయన ప్రారంభించారు. అయినదేదో అయింది. దానికో తీరూ, తెన్నూ చూపక తప్పదు. కనుకనే నేను తిరిగి ఈ క్రింది విభజన చేస్తున్నాను. మన విమర్శకులు ఈ వర్గాలలో దేనికో దానికి చెందుతారు.

ఒకటి: లక్షణశాస్త్రజ్ఞానం లేనివాళ్ళు. వీళ్ళకు వచ్చటమూ, నచ్చకపోవటమూ మాత్రమే కావ్య ఔచిత్యానికి ప్రమాణం. ఎందుకు నచ్చిందో, ఎందుకు నచ్చలేదో వాళ్ళకే తెలియదు. వాళ్ళు చెప్పనూ లేరు.

రెండు: ఒకటో రెండో లక్షణశాస్త్రాలు చదివినరకం. శాస్త్ర పరిభాషకు సంబంధించిన సంకేతాలు కొన్ని వచ్చును గాని వాటిలో సంకేతమయిన విషయం తెలియదు. ఒక మహాపండితుణ్ణి నేనొకసారి రసమంటే ఏమిటని అడిగితే ఆయన నోట్లోని లాలాజలాన్ని ఎగజుర్రి 'రసోవైసః' అన్నాడు.

మూడు: వీరికి లక్షణశాస్త్రాలు, వాటి పరిభాష, అందులో సంకేతితమైన విషయమూ తెలుసు. ఎటొచ్చీ తన జ్ఞానాన్ని నూత్న కావ్యాలకి సమన్వయించలేదు. లోగడ లక్షణశాస్త్రాలలో ఉదాహరణలుగా చదివిన శ్లోకాలకు మాత్రమే తన పరిజ్ఞానాన్ని నియమించుకుంటాడు. తెలుగు గ్రంథాలన్నీ చచ్చువంటాడు.

నాల్గు: శాస్త్రజ్ఞానం ఉంది, ఆధునిక [ప్రాచీనపద్ధతిలో] ఆంగ్రకవిత్వాన్నికూడా హర్షించగల శక్తిగలవాళ్ళు; ఎటొచ్చీ వారి లక్షణశాస్త్రాలు పరిమితమైపోయి ఉండటంవల్ల నూత్న లక్షణ శాస్త్రాలకు సమన్వయపడే కవిత్వాన్ని సహించలేరు.

అయిదు [ఆధునిక] లక్షణశాస్త్ర పరిజ్ఞానం ఉండి పరంపరానుగతమైన లక్షణమార్గం తెలియకపోవటంవల్ల [ప్రాచీన] కావ్యాలను హర్షించలేనివారు.

ఆరు: ప్రాచీన అధునాతన లక్షణమార్గాలన్నీ తెలిసి, నూత్న లక్షణాలను సృష్టించగల ప్రతిభతో, అభేదబుద్ధితో ప్రాచీన అధునాతన కావ్యాలలోని ఉత్కృష్టతను ఔచిత్యం చెడకుండా, తర్కంతో సమర్థించుకుని చెప్పగలవాళ్ళు.

ఈ షడ్వర్గాలనీ జాగ్రత్తగా పరిశీలించినట్లయితే ఆరవ వర్గంవారే నేడు మనజాతికి అత్యవసరమని చెప్పుకోవాలి. వారినే శ్రీ శాస్త్రిగారుకూడా పూజిస్తున్నది. ఇందులో మా యిద్దరికీ అభిప్రాయభేదం లేదు.

స్వభావాన్ని బట్టి విమర్శకులను ఆరుగా పైన వివరించాను. ఈసారి ప్రవర్తనను బట్టి వివరిస్తాను.

మూల్యనిర్ణాయకులు : లేక "ధర్మ నిర్ణయాధికారము" చెలాయించేవారు. పై ఆర్గురూ ఈ తరగతిలోకి వస్తారు. అందులో ఉత్తము దెవరో చెప్పనేచెప్పాను. ఇంగ్లీషులో వీరిని Judicial critics అంటారు.

వ్యాఖ్యాతలు : ఇందులో ఉత్తముల గురించి నేను మనవిచేశాను. అధముల గురించి శాస్త్రిగారు వివరించారు.

మూలతత్వ శోధకులు : Inductive critics అనిగాని, Analytical critics అని గాని వీరిని చెప్పవచ్చు. వీరిని గురించి శాస్త్రిగారు ప్రస్తావించలేదు. ధర్మనిర్ణయాధికారాన్ని వీరు వహిస్తారు గాని, అలా ఏమాత్రం పైకి కనబడరు. ధర్మాధర్మములను నిష్పాక్షికంగా ఎత్తిచూపి స్వయం నిర్ణయాధికారాన్ని పాఠకుడికి యిస్తారు. ఇదికూడా కాంతా సమ్మితమే.

వీరినే నేను ఉత్తమ విమర్శకులంటాను. ఇందులో ఆఖరి వారిని సంపూర్ణవిమర్శకులంటాను. నే నిప్పటికీ అలాంటివారి కోసమే కలలుగంటున్నాను. శ్రీ శాస్త్రిగారిపై నా కా ఆశ వున్నది.

ఏమయినా శ్రీ శాస్త్రిగారు ధైర్యసాహసాలతో పురోగమిస్తూకూడా విమర్శకుడికి ఉండరాని రాగద్వేషాలకులోనయి ప్రమాదాలలో పడకుండా చూడటం కోసం ఆయన్ని అనుసరించటం మంచిదని వారి ఈ వ్యాసం నన్ను హెచ్చరించింది.

## యొక్క

"యొక్క చ శేషే షష్ఠీ" అని ఆంధ్రశబ్ద చింతామణి యందే పేర్కొనబడినది. ఈ ప్రత్యయమును గూర్చి చర్చించి శ్రీ వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారు ఇట్లు చెప్పిరి. "తెలుఁగులోని 'యొక్క' విభక్తి 'కేవలార్థక' 'ఒక్క' శబ్దరూపమనియే తోఁచుచున్నది. 'నాయొక్క పుస్తకము' అనుదానికిఁ బుస్తకమం దితరుల స్వామ్యము లేదనియు, 'ఒక్క నాయదియే' యనియు నర్థము. దాని ప్రత్యయత్వావస్థ వలనఁ గల్గియుండునని తోఁచెడిని" కనుక అది 'ఒక్క' కాదు అని చెప్పవీలులేదుకదా !

యకారము 'తెలుఁగు మాటలకు' మొదట లేదు - అని మాత్రమే చెప్పబడినది. ఈ 'యొక్క' విభక్తిప్రత్యయము. దీనికి స్వతంత్ర ప్రయోగార్హతలేదు. 'మాటలకు' స్వతంత్ర ప్రయోగార్హత కలదు. అందుచే ఆ 'నిషేధము' 'యొక్క' ను బాధించదు.

—దేశపతిరావు

# పుస్తక సమీక్ష

## ఆనందచేతన

32 పేజీలు వెల : రూపాయి

శ్రీ తేతవరపు వేంకట రామకోటిశాస్త్రి

*అరుణశ్రీ గ్రంథమాల, సికిందరాబాదు.*

ప్రతులకు : క్వాలిటీ పబ్లిషర్సు విజయవాడ - 2

చేతనా శబ్దమునకు మన వేదాంతములయందుఁ బ్రత్యేకమైన యర్థమున్నది. 'ఆత్మ చైతన్యాభ్యాస రసవిద్ధా చేతనా' యని శ్రీ శంకరాచార్యుల గీతా భాష్యోక్తి. 'సాచిక్షేత్రం జ్ఞేయత్వాత్' అనియు నాచార్యు లనువదించిరి. ఆనందచేతన యను పేరి గ్రంథమునకుఁ బెట్టుటలోఁ గవి యీ యర్థము నుద్దేశించియే యున్నాఁడని యనుకొందము. కవి విమర్శకుడు. పరిశీలనాత్మకమైన బుద్ధివృత్తిగలవాఁడగుటచే 'రసవిద్ధా' యను నాచార్యోక్తి యీ కవి విషయమునఁ బరిగ్రాహ్యమే యగుచున్నది. 'ఆనందచేతన' యను శబ్దమునఁ గొంచెము పునరుక్త్యాభాస లేకపోలేదు. ఆత్మ చైతన్యాభాసము రసవిద్ధ మగుటచే నానంద శబ్దమే యీ పునరుక్త్యాభాసకుఁ దావిచ్చుచున్నది.

ఈ గ్రంథకర్త యొకఁ నవీన గురుకులమునకుఁ జెందినవాఁడు. ఈ గురుకులమువారు సుఖజీవులు కారు. తాము బాధపడి పరులను, పఠితలను, బాధ పెట్టెడి మచ్చు. 'అన్యదాలోచనామృతమ్' అను నది వీరి యొరవడిబంతి. లలాటంతపమైన యూహ చింతనఁజేసి, యేదో యనిర్ధార్య విషయమును నిర్ధారితముగఁ జెప్పుచుండు ఫణితి వీరికొక యలంకారము. అట్టి వారిలో శ్రీ రామకోటిశాస్త్రిగారొక్కరుగాఁ జేరినారు. వారి పరిశ్రమ యెట్టిదో పరిశీలించుట పరిశీలకులైన విమర్శకుల ధర్మము.

'ఆనందచేతన' శివార్పితముగా వ్రాయఁబడిన గ్రంథము. ఇందు ద్వైతాద్వైతముల, బాధానందముల కలయిక యున్నది. శుద్ధాద్వైత మీ కవి కిష్టము లేనట్లున్నది.

"తనకిక జన్మ వద్దనెడి తత్త్వము మంచిదిగాదు"

(22 పుట.)

ఈమున్నగు పద్యములీభావమును బుట్టించుచున్నవి.

తలచి తలచి చివరకుఁ దేల్చిన తత్త్వమేమనగా.

'తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి, అనశ్నన్నన్యో అభిచాకశీతి' యను శ్రుత్యుక్తమైన ఫణితిలో,

'ఇట్టులె మేల్కొని యుండురా శివా' యను మకుటముతో వ్రాసిన నాల్గయిదు పద్యములు ద్వైత ప్రతిపాదకములయ్యును అద్వైత వాసనా భరితములై యున్న వనుటకు సందియములేదు.

ఈ గ్రంథము సప్తభూమికలు గల్గియున్నది. చతుర్థ భూమికాంతమున

'నన్నును నేనెఱింగితి ననంతునిగా' ఇత్యాది రచనముతోఁగావ్యమునకు భరత వాక్యము చెప్పినట్లయినది. ఇక వక్తవ్యాంశము లేదు. కాని చేతన యడ్డు వచ్చినది. అది 'రసవిద్ధ' కదా!

ఈయనకు మమకారములేని భోగములు కావలయును. దానితో విశ్వదాంపత్య ధర్మమును గూర్చి కొంత చర్చసాగినది.

గృహ' మన భార్య, భార్యయన కేవల శక్తి, గృహస్థుఁడన్నచోఁబిహితుఁడు శక్తిచేత' ఇట్టి విశ్వ సామరస్య సిద్ధాంత ముదితమైనది,

కావుననే లోకములో నెందును గనివిని యుండని యొక క్రొత్త భావము నీ కవిచెప్పగల్గినాఁడు.

'కోపన పరాఙ్ముఖియైచను భార్యగాఁ జనన్'

'అవుదువ యేమి సామి మరియాద త్యజించి మదీయ భార్యగా,'

ఈ భావము త్రైకాలిక కవులలో నెవ్వరును బ్రకటింపనిది. ఈ భావమునకు మూలమొక్క శాక్తేయ సంప్రదాయమున మాత్రమే యున్నది. శివశక్తి సామరస్యమున శివతత్త్వము శక్తి ధర్మములను శక్తిధర్మముల శివుడును బొందుచుందురని మాతృక చక్రవివేకాది గ్రంథములలో నిరూపింపఁబడియున్నది. ఈ సామరస్యప్రతిపాదికమైనవే పరాప్రాసాద, ప్రాసాదపరా మంత్రములు—ఇది మంత్రశాస్త్ర విషయము. అస్తు.

రామకోటి శాస్త్రిగారి గ్రంథము తత్త్వోద్ఘాటక మైనది. ఆత్మావేదకమైన గ్రంథము. ఆత్మనివేదనము మొదలు ఆత్మానుభూతి పర్యంతము జీవుఁడొందు వేదన యీ సప్తభూమికలయందుఁ బ్రపంచితమై యున్నదందము. ఇది తత్త్వ కవిత్వమా? కవిత్వ తత్త్వమా యను విచారణ కొందఱకు జనింపవచ్చును. ఇది కవిత్వమే కాదని కొందఱు త్రోసిపుచ్చుటకు నవకాశము లేక పోలేదు. అది చాల తేలికయైన విషయము. కాని యిది తత్త్వ ప్రధానమైన కవిత్వమనిగాని, కవిత్వ ప్రధానమైన తత్త్వమనిగానియందము. అయినచో నుభయనిర్వచనములం దుభయము నుపసర్జనత్వమొంది మిగులునది శూన్యమగునను వితండకిందుఁ దావు లేకుండుగాక!

కవితా మహత్త్వము వస్తుగతమైయుండును గదా! ఆ వస్తువు శివుఁడు, తత్సహచరుడు జీవుఁడు శివ జీవతాదాత్మ్యమిందలి వర్ణ్యాంశము. వైరాగ్యాదులు సత్త్వాది సామగ్రి సంపాదింపగా, శివజీవ సామరస్యమను స్థాయితో నొప్పారు శాంతరసము చర్వ్యమాణదశకు వచ్చుచున్న దందము.

ఇది వట్టి యారోపిత ప్రత్యవభాసము. ఈ గ్రంథమున కింత శక్తి యెచ్చటిది. ఇది యభిమాన చోదితమైన భ్రాంతి వాక్యమందురేని,

వదలగనేల దివ్వియల
పల్లువు వెల్గిది కాపురమ్ము నా
యెదయెద యెల్ల నీ వెలుగులే
యయిపోయెను, రెండు వెల్గులున్
కుదురక యేకమై నిలచి
కోటిరవిప్రభయాత్మదీప మ
ట్లిది యిదియేమి భాగ్యముర!!
యిట్టులె మేల్కనియుండు శివా!

యనుపద్య మా వాదమును సహస్రధా ఛిన్న మొనర్చి కవియొక్క భావనాదశాస్థాయికిఁ బ్రదీపకమై యున్నది. అనుభూతి నిరపేక్షకమైన వాఙ్మాత్ర వ్యాపారము కావచ్చునన్నచో నది పాఠకుని సంస్కారలోపమే యగునుగాని కవి శక్త్యభావ నివేదకము కాదు. వాక్కు భావన్మాత్రమైన పరావాఙ్నివేదక మగుట శాస్త్ర ప్రసిద్ధము.

ఈ కాలమునఁ గవితావిచార మొనర్చుచో నాత్మాశ్రయమైన కవిత్వమను నొకమాట వినబడు చున్నదికదా! ఆ యాత్మాశ్రయ కవిత్వమున నిది మేలుపూస యనఁదగియున్నది. కాని యొక విషయము మాత్రము చెప్పదగియున్నది. ఇందలి సప్తభూమికల యాద్యంతములఁ బరిశీలించినచో దేనికది యాద్యంతవంతమై సామరస్యస్ఫూర్తి కలుగుచున్నదిగాని, యీ సప్తభూమికల నేకఖండముగాఁ బరిశీలించినప్పు డేకధార లేనట్లుండి ముందు వెనుకల గుదిగ్రుచ్చి చూచికొనవలసిన యావశ్యకత యేర్పడుచున్నది. చతుర్థ భూమి కాంతమునందలి రచన తదుపరి భావనా ప్రసృతి కెడమీయని దగుట యిదివఱకే చెప్పఁబడినది. ప్రథమ భూమికాంతర్గతమైన 'ఒక భార్యయ చాలునో ప్రభూ!' యను వాక్యముచేత నభివ్యంజితమైన (హాస్యగర్భితమైన) భావవస్తువునకును, పంచమభూమికాగతమైన లాస్యతాండవ చర్చకును సామరస్యము పొసగక భావైక్యధారకు భంజకమై యున్నదని సానుభూతివిరహితుడైన కేవల విమర్శకుడు వాదింపవచ్చును. కాని చతుర భూమికా ద్వితీయ పద్యము.

'ఈయవలెన్ వివాహమున
నీకున కీమె నటన్నదుగ్ధతా
లీయము సోగకన్నుల
విలీనము ముగ్ధవిలాసహాసరే
ఖాయతి తాతపాదు లలితాం
కమునన్ చిరులజ్జ వోవు
కాత్యాయని లీలఁ దోచెడినయా!
కరణమ్మిదె నీవు చూపుటన్.'

దానికి సమాధానము చెప్పి కవియొక్క భావనా

సార్వభౌమత్వము నుద్ఘాటించుచున్నది— ఇందలి యలంకారకృత వస్తుధ్వని పరమోత్తాలభావనా వ్యంజకమై కవి సామాన్యుఁడు కాదని నిరూపించు చున్నది.

ఈ గ్రంథము భక్తి జ్ఞాన వైరాగ్యముల కునికి పట్టుగా నున్నది. వాని నన్నిటిని విస్తరభీతిచే నిందుదాహరింపలేకుంటిని. ఆ భక్తి జ్ఞాన వైరాగ్యములు వాచ్యములుగాక వ్యంగ్య వైభవ ప్రదర్శితము లగుట కవి ప్రతిభా విశేషమును బట్టి యిచ్చుచున్నవి.

ఈగ్రంథము సర్వలోప రహితమాయని ప్రశ్నింప వచ్చును. కాదు, లోపములున్నవి. అవి రసభంజక ములుగా లేవు. లోపము లెన్ని చూపినను నీతఁడు కామమ్మ భర్తాకృతి దాల్పఁగల 'మొండ్యగ్రణి'. కావున మన విమర్శ లిక్కడఁ బట్టవు. అయినను లోపము తెల్పుట యాంధ్రుల కలంకారము. 'బ్రతుకుట కోసమై తినుటవచ్చినదా' యను భావ మెంగిలి వ్రాత. ఇంగ్లీషు శబ్దమునకు వికృతి 'యెంగిలి'. 'నేను శరీర మంచనుకొనే తరుణాన' ఇత్యాది భావము సంస్కృత శ్లోకమునకుఁ దెనిగింపు. ఇంత ప్రతిభాసంపన్నుని గ్రంథమున నిట్టి వుండుట ప్రతిభ కపచార హేతువు.

ఈకవి స్వయముగ విమర్శకుఁడు. కవి విమర్శకుఁడు కానేరఁడని యొకరన్నారు. అదినేనంగీకరింపలేకుంటిని. మహాకవి కాళిదాసు మహా విమర్శకుఁ డనుటకుఁ గోట్యంశములు పేర్కొన వచ్చును. విమర్శకుఁడుగాని కేవలకవి, కవి శబ్ద వాచ్యుఁడే కాఁడు.

'ఆయుష్యము నిమ్ము నీ కరుణ
నుగ్ర! అనల్ప మహత్త్వ కల్ప!
నిజ భాష్యముచేసి చూపెదను
వట్టి సుధామధు గర్వ నిర్భరుణ్'

ఆయుష్యమున్నచో నా భాష్య మెట్టిదో చూడ వలయునని నాకున్నది. పరమేశ్వరుఁడీ కవికి వేదోక్తమైన పరిపూర్ణాయుష్యము నిచ్చుఁగాక! ఈయన సారస్వతావకాశమున 'పాడి చెవా మార్తాండు డన్నట్లుగా' వెలుంగుగాక!

కేవల పురోభాగిత్వము విమర్శనముకాదు. షష్ఠభూమి కాంతర్గతమైన, 'మైలకు వచ్చుచుణ్. ఇత్యాది పద్యమున శివునకుఁ దెమడ తన మారోపితమైనది. ఇది నీచోపమకదా! అట్లని దోష ప్రకరణమునఁ జేర్పఁజాలము. అందలి యనుభూతి కర్కశత్వమును భావించుచో నా యుపమయు రస పర్యవసాయియే యగుచున్న దనవలదా?

'నే నొద్దందునా?' 'బహు రెచ్చగొట్టెదరు' ఇత్యాది చ్యుతసంస్కృతులున్నవి. ఇవి తెలిసిచేసిన వగుట మఱియును క్షమార్హములు కావని తోచును. తెలిసిచేసిన తప్పునకు న్యాయస్థానములు గొప్ప దండన విధింతురు. కావ్యస్థానమునఁ దెలిసి చేసినదానికి దండనలేదట. కవుల నిరంకుశత్వము దిక్కులేని వ్యాకరణము మీదికిఁ బ్రసరించుచుండుట విషాదావహము.

ఈయన కవిత్వము నారికేళపాకము. వృత్తి భారతి. సమాసములు గుప్పి సంతోషించును. ఈయన సమాసము నిర్దుష్టమై గంభీరార్థ ప్రతిపాదకమై, సార్థ చమత్కృతి శీలమైయుండును.

'ప్రణవచిరంటినీ హృదయ పంకజమత్తమధు వ్రతాయితా' ఇందలి చిరంటిని' శబ్దనిష్పత్తి యెట్లో విచార్యము.

ఈ కవియొక్కధారాశుద్ధికి 'అయమాత్మా పరమాత్మనా' మున్నగు ప్రయోగము లుదాహరణముగాఁ జూపవచ్చును.

చివరకొక్క రహస్యము తెలిపి యీ సమీక్ష ముగింతును. ఈ కవికి శివాజ్ఞయెట్లు కల్గినది? ఆ రహస్యము ద్వితీయ భూమికాదియందున్నది.

'అలిగి వృథా క్రుధంబడి మహాశనివోలి కపైకి దూకి భార్య లలితసుందరాకృతిని అంతమొనర్చెడు నట్టులైన వేళల సజలమ్ములై సభయలాస్యములై

కనిపించు నా మొ కన్నులతుది శాంత నిర్మలమునుం డగుపింతువు వెల్గుగా శివా !'

ఈ లాస్య తాండవ ద్వంద్వ సామరస్యమునే యీ కవి సర్వథా ప్రపంచించి కావ్య నిర్మాణ మొనర్చినాడు. ఇకపై నీయనఘుడీ తాండవము నాపి యాలాస్యదర్శన లాలసుఁడై శాంతమగు నానంద జీవితము గడపుచు శివ భాష్యములు వ్రాయుచుండుగాతమని కోరుదుము.

— *విశ్వనాథ వేంకటేశ్వర్లు.*

## శివానుగ్రహము – పితృయజ్ఞము

**శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు**
**మునిరావు వీథి, కడప.**

**పుటలు 56** **వెల : రు 1-50**

ఈ శివానుగ్రహము పితృయజ్ఞము అన్న గ్రంథములో నున్నవా శీర్షికలతోడి రెండు రచనలు. శివానుగ్రహము శతకము. శివామ కుటము గలది. అన్నియు మత్తేభశార్దూలములు. పితృయజ్ఞ మన్నదానిలోనివస్తువు దశరథుని మరణమును చిత్రకూటస్థుడైన రాముడు విని ఆక్రోశించి వసిష్ఠునివలన తేరుకొని పితృకర్మకు పూనుకొనుట. ఈ పితృయజ్ఞమున కవతారికగా నున్న మొదటి ముప్పైఏపద్యముల కొక ప్రత్యేకత యున్నది.

ఆస్తికుడైన జీవుని ఆర్తియొక్క బహుముఖము లొక శతసంఖ్యాకైన మూసలలో నభివ్యక్తము చేయుట శతకమువ్రాయుట. ఆర్తి సాధారణ ముగా జీవుని ఐహిక జీవనానుభవ మాధారముగా బయలుదేరి తన సాంప్రదాయికమైన విజ్ఞత కలిమిని మూర్తి కట్టుకొని పరమేశ్వరానుభూత్యధ్వమున సాగును. ఏతదనుభూతిలో కుదురుకొని శాంత పడును. ఆ ఐహిక జీవన దర్శనమాయాజీవుల సంస్కారమునుబట్టి యుండును. శివానుగ్రహ ప్రాప్తి నాకాంక్షించు ఈ శతకస్థమైన జీవున కొక సంస్కారమున్నది. సాంప్రదాయికమైన అద్వైత భావముయొక్క స్ఫూర్తితోడి ద్వంద్వ బాధిత మైన ఐహికానుభవసంస్కారమది. అద్వైత భావస్ఫూర్తి యనుటవల్ల ఈ శతకమున ఇహానుభవ వ్యక్తీకరణము ప్రచురముగా నున్నదనుట. ఈ ఇహానుభవములోని ప్రధానాంశములు తాను కవినన్న తెలివి, తన వంశములోని పూర్వులు కవులన్న తెలివి, తన నంటిపెట్టుకొనిన సంసారము యొక్కయు, దారిద్ర్యము యొక్కయు ఎరుక, తన యీ కవితావ్యాసంగమే శివానుగ్రహ ప్రాప్తికి హేతువగునన్న నమ్మకము – ఇత్యాదులు. మరియు నా జీవుని అద్వైత భావస్ఫూర్తి పరమే శ్వరునితోడి తన బాంధవ్యము నాడునాటికి సమ్యగ్దివ్యరూపంబు పొందుటను- నిస్సందేహముగా కొన్నినాళ్ళకది ఏకతాభనినైయె వర్ధిలునన్న తలపును బట్టి యుండుటను వ్యక్తీకరించుటలో నున్నది. మరియు తన కవిత్వఫలసుమమహములన్నియు శివునకై వానిని గొనివచ్చి తనలో నిల్పునన్న దానిలోను ఆ అద్వైతస్ఫూర్తి యున్నది. ఆ వాని తనలో నిల్పుటవలని ఆనందమును కవితా నందముకన్న మించి జీవుడు భావించలేకపోవుట కేవల స్ఫూర్తిమాత్ర పర్యవసితాద్వైత భావమును స్థాపించును. శివానుగ్రహ ప్రాప్తిని సూచించుటతో కూడ తాను శివేతరుడనన్నట్లుగా నున్నది. 'నిన్నే నన్నుగ నన్నునిన్నుగను గొంటే చాలు' ఇది అద్వైతభావాభిముఖమైన జీవుని నిరీక్ష. అద్వైత భావానుభూతిని పొందిన తరువాత నిరీక్షలేదు. ఈ శతకమున జీవునకు నిరీక్ష లేకపోవుటలేదు. ఈ లేకపోవుట లేనిదాని చరమదశ ఇది—

అదిగోనో ! బసవేశపాదముల
　చిహ్నాల్ తోచు నా దిక్కుగా
అధిగమ్యుండయినట్లు తోచెడిని
　నా స్వాంతంబులో భక్తి సం
పద కొండంతగ కోటి కొండలుగనై
　వర్ధిల్లెడున్ నేడు నా
యెదలో నూత్నమహానుభూతి యొక
　దేదో కల్గుచుండెన్ శివా !

ఇక పితృయజ్ఞము. వైదికమైన కర్మనిష్ఠ, తదాంతర్యము నెరిగిన తెలివి, పితృ పరాచ్ఛ భక్తి ఈ మూడింటిని కవియైనవాడు భావనచేసి వ్రాసి నచో 'పితృయజ్ఞము' వంటి రచన వచ్చును. మరియునందు ముఖ్యముగా నవతారికగానున్న ముప్పైఏపద్యములవంటి రచన వచ్చును. శివా నంద లహరిలోని 'కలాభ్యాం చూడాలంకృత శశి

కలాశ్యాం' అన్న మొదటి శ్లోకముతో నీ పితృయజ్ఞము రచనము ప్రారంభింపబడినది. ప్రతి ప్రత్యూషః ప్రసారణమున నా శ్లోకమును బ్రతికినంత కాలము పాడిన పరమావతారము విలీన శివాత్మక తత్పితృ ప్రమాప్రణవ ముపాసింపబడినది. పితృస్వరూపము శివరూప పరబ్రహ్మముగా దర్శించుటకు 'ఈశానః పితృరూపేణ మహాదేవో మహేశ్వరః ప్రియతాం భగవానీశః పరమాత్మా సదాశివః' ఇత్యాది వైదికకర్మపరమంత్రముల నాంతర్య మెరిగెడు సాంప్రదాయికమైన విజ్ఞత మూలము.

రుద్ర వసుమిత్ర పితృదేవ లోకదత్త
చాతురీ కమనీయ పౌరీతమగుచు
నాతనూవాహనమై ప్రాణానిలంబు
నాగళంబులో రేపుచున్నది స్వరంబు.

పితృ పితామహ ప్రపితామహులు వసురుద్రాదిత్య రూపులు. ఈ ప్రాణానిలముతోడి ఈ శరీరమిల్లేర్పడుటకు వారు కారకులు. అట్టి వారినిగూర్చి చేయునది కర్మను మీరి యజ్ఞమైనది. ఈ పద్యములో 'రుద్రవసుమిత్ర' అన్నదానిని 'వసురుద్రమిత్ర' అను క్రమములో నర్థము గ్రహింపవలయును. పితరం వసురూపం పితామహం రుద్రరూపం. ప్రపితామహం ఆదిత్యరూపం. ఇది వరుస. వైదిక కర్మానుష్ఠానమునుండి కవిత్వమును భావించుట సామాన్య విషయముగాదు. వరలక్ష్మీ త్రిశతిలో అట్టి భావన పరాంకోటికెక్కియున్నది. ఏవం విధమైన భావన చేయగల రెండవ వ్యక్తి ఈ పితృయజ్ఞ కర్త.

రాజోపచార సర్వ సురోపచార యో
గ్య పితృ దేహంబు చితాగ్ని వ్రేల్చి
అతి లోక పావిత్ర్య వితత మూర్తులగు పి
త్రాస్థికల్ నీరంబులందు త్రోసి
సన్నిహిత పితృ ప్రశస్త భావము దూర
వసు లోక భూములవఱకు దోలి
శాశ్వతంబుగ భూమి చాయకురా వీలు
పడనట్టి పెక్కు కట్టడులు చేసి

అతి ప్రలుబ్ధ మతిని గృహ యాజమాన్య
పదవి దుశ్చింతచేసి రా బట్టుకొంటి
శిక్షయే మందు నాదు దుశ్చేష్టితముల
కమిత పాపాత్ముడను పితృహంత నేను.

ఈ పితృ యజ్ఞ కృత్యవతారిక ఇట్లు గాసాగినది. ఏవం విధమైన పీఠికకూర్చిన తరువాత శ్రీరాముని పితృ యజ్ఞమునకున్ముఖుడగుట వ్రాయబడినది. పితృయజ్ఞము చేసినచో శ్రీరామచంద్రుడే చేయవలెను. ఆ వాని పితృభక్తియట్టిది. రామాయణమును పూర్తిగా నర్థముచేసికొనుటలోని ఒక అంశము శ్రీరాముని పితృభక్తి. ఏతదంశమును పట్టుకొనకపోయినచో పితృ మరణ వార్త విన్న చిత్రకూటస్థుడైన రాముని పితృయజ్ఞ స్ఫురణము రాదు. శ్రీరామలింగేశ్వరరావుగా రాస్ఫురణముతో నా ఘట్టమునందుకొన్నారు. ప్రథమ ఖండముగా వ్రాసిన అరవై మూడు పద్యములలో రాముని దుఃఖోద్విగ్నత, ఆ దశరథుని మరణము నెరిగింపజాలక సుమంతుడుపడిన వేదన పరమ రమణీయముగాను ఔచితీజ్ఞానపర్యాప్తముగాను నున్నవి.

ఎడదన్ దుఃఖము కంటి కోణములలో
నేర్పడ్డ బాష్పంబులై
జడివానై హ్రదమై దిలీపరఘు
రాజన్యుల్ మృతింబొంది రె
ప్పుడో ! అనాళ్ళది దుఃఖమెల్ల
నపుడై పూర్వాపరంబుల్ స్మరిం
పడు తత్కాలగత ప్రధాన విషయ
వ్యాపారముల్ మంత్రియున్.

ఇది సుమంతుని ఆపడిన వేదనావిష్కరణములోని ఒకస్థితి—ద్వితీయ ఖండముగా వ్రాయబడిన వసిష్ఠోపదేశము వేదాంతమీ పితృయజ్ఞేతివృత్తమునకుత్కర్షాపాదకముగాలేదు—

ఇంతగా సంప్రదాయనిష్ఠ, వ్యుత్పత్తిసముచితమైన ప్రతిభ పుష్కలముగాగల ఈ కవి 'శశ్వదుదారభావ పరిసంగత సుష్ఠుపదావళీలసన్నిశ్వసదబ్జసూతిరమణీ రమణీయ మహః ప్రియాకృతి'.

—'క్షేమేంద్ర'.

## వచ్చే సంచికలో

సంపత్కుమార్

ప్రయాగ కోదండరామశాస్త్రి

బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి

మల్లంపల్లి శరభయ్య

డా. సంపూర్ణానంద్

దండమూడి మహీధర్

కంచి శేషగిరిరావు

కేతవరపు రామకోటిశాస్త్రి

విశ్వనాథ సత్యనారాయణ

౩౧౬, సుల్తాన్ బజార్, హైదరాబాదునుండి జువ్వాడి గౌతమరావుచే ప్రకటితము. ఫోన్ : ౪౬౧౬
అజంతా ప్రింటర్సు, సికింద్రాబాదు.